# సాహితీ చైతన్య పోతుకూచి సాంబశివరావు సాహిత్య దర్శనం



(బహుముఖ పరిశీలనం)

(సప్తత్యర్థం)



శిరిపురపు జవహర్‌లాల్

విశ్వసాహితి రజతోత్సవ ప్రచురణ

విశ్వసాహితి

6-3-195, న్యూ బోయిగూడ, సికింద్రాబాదు

Sahiti Chaitanya
Pothukuchi SambasivaRao
Sahitya Darsanam

By

SIRIPURAPU JAWAHAR LAL



27 జనవరి 1987



వెల : రు 10-00

ముద్రణ : దక్షిణ భారత ప్రెస్
ఖైరతాబాదు, హైదరాబాదు

ప్రతులకు : Pothukuchi Agencies
6-3-195, New Bhoiguda
Secunderabad-500 008

# నా ఆశీస్సు

యువరచయిత, ప్రముఖ కార్యకర్త శ్రీ యస్. జవహర్‌లాల్ పోతుకూచి సాంబశివరావు రచించిన అనేక సృజనాత్మక గ్రంథాలు పరిశీలించి 'పోతుకూచి సాహిత్యదర్శనం' గ్రంథం రచించడం ముదావహం. పోతుకూచి సాహిత్య రంగంలో ఒక సమున్నత స్వరూపం సంచలనం కలిగించిన నవలలు, ఆసక్తికరమైన సాంఘికకథలు, ఉదాత్తమైన కవితలు ఉత్తేజకరమైన నాటికలు, నాటకాలువ్రాసి, శ్రీ పోతుకూచి అగ్రస్థానం పొందాయి.

ఆయన రచనలపై విశ్వవిద్యాలయాలు పరిశోధనాత్మక గ్రంథాలు ఏర్పాటు చేయవలసిన ఒక బృహత్తరకార్యం జవహర్‌లాల్ చేయడం చాలా సంతోషకరం—

ఈ గ్రంథం సాహిత్య లోకానికి క్రొత్తవెలుగు యివ్వగలదని నా విశ్వాసం.

తారనాకా డా॥ సి. హెచ్. దేవానందరావు

25-1-1987 హైదరాబాదు ఆహ్వాన సంఘాధ్యక్షులు

విశ్వసాహితి రజతోత్సవాలు

# అభినందన

ఒకర్ని గురించి రాయాలని అనిపించిందంటే, ఆ వ్యక్తిలో ఏదో ఒక ప్రత్యేకత ఉండే ఉంటుంది. ఆ ప్రత్యేకత పది మందికి తెలిసేట్లు కార్యరంగాన్ని కొందరు సృష్టించుకుంటారు. కొందరు పదిమందికీ అవకాశం కల్పిస్తూ కార్యరంగాన్ని రూపొందించుకుంటారు. ఈ రెండో వర్గంలోని వ్యక్తి పోతుకూచి సాంబశివరావు. స్వ పర భేదం ఎరుగని నిర్విరామ సాహిత్యోద్యమకర్త పోతుకూచిని గురించి శిశిపురపు జవహర్‌లాల్ రాయబూనుకోవడం వ్యక్తిని గురించి రాయడం కాదు, తెలుగునాట ఒక స్వచ్ఛంద స్ఫూర్తిప్రద సాహిత్య ప్రోత్సాహశక్తిని గురించి రాయడం.

చిన్నవారి నుంచి పేరు పొందిన వారి వరకూ సాహిత్యం పట్ల ఈషణ్మాత్ర శ్రద్ధాసక్తులున్నా సరే, సమీకరించి, వారి చేత సాహిత్య యజ్ఞం చేయించే దీక్ష ఉన్నవాడు పోతుకూచి. అతను రచయిత, కార్యకర్త, ఉద్యమ నిర్మాత, పత్రికా రచయిత, నాటకకర్త, నటుడు, న్యాయవాది, నిరాడంబరుడు, ఆశావాది, ఉత్సాహప్రదుడు- అతడేమి కాదు? అన్నీను. అయితే పోజు లెరుగడు, భేషజాలు చూపడు, సహాయం కోరినవాణ్ణి కాదనడు. అక్షరాభ్యాసం చేస్తున్న వాడినుంచి అఖండ పండితుడి వరకూ వేదిక కల్పించగలడు. హోదాల్ని బట్టి, ప్రయోజనాన్ని బట్టి, ధనాన్ని బట్టి వ్యక్తుల్ని దగ్గరకు తీయడం, వ్యక్తులకు దగ్గర కావడం వంటి గుణం లేని భోళా సాంబశివుడు. ఉన్నంతలో పదిమందినీ చేర్చడం పది మందికీ ప్రచారం కల్పించడం వంటి చాకిరీ చెయ్యడంలోనే తృప్తిని వెదుక్కుంటున్న నిబ్బరపు వ్యక్తి పోతుకూచి.

అతనికి ౩౬ సంవత్సరాల సాహిత్య జీవితం పూర్తి అయిన సందర్భాన జవహర్‌లాల్, ౩౬ అధ్యాయాలుగా పోతుకూచి కార్యరంగాన్ని విభజించి, అతని సహృదయ కార్యకర్తృత్వాన్ని, కావ్యకర్తృత్వాన్ని సూచిస్తూ లఘు పుస్తకాన్ని రాసినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. పోతుకూచి సామాజిక కార్యకర్త, రాజకీయ పరిశీలకుడు, సెన్సారు బోర్డు సభ్యుడు కూడా. తన కార్యక్రమసీమ కతనొక రింగ్‌మాస్టర్. జీవితంలో బాధలెన్ని ఉన్నా బాధ పడని వ్యక్తిత్వం అతనిది. మిత్రత్వం అతను తాగిన అమృతం.

జవహర్‌లాల్, పోతుకూచిని సన్నిహితంగా ఎరిగిన ఆత్మీయుడు కాబట్టి ఆ వ్యక్తిత్వాన్ని సులభశైలిలో దిఙ్మాత్రంగా పరిచయం చెయ్యడంలో కృతకృత్యులయ్యారు.

పోతుకూచి లోని గొప్ప గుణం యాక్సెసబిలిటీ. గర్వమెరుగడు గాని ఆత్మగౌరవం వదలడు. ఇంత విస్తృత కార్యరంగాన్ని ఎలా నిర్వహిస్తున్నాడన్న ఆశ్చర్యానికి తావివ్వడు, తన ధర్మం తాను నెరవేరుస్తున్నానన్న తత్వంతో సాహితీ చైతన్యాన్ని పంచిపెడతాడు. అందుకున్నా సంతోషిస్తాడు. అందుకోకున్నా సంతోషిస్తాడు. పోతుకూచి సాహిత్య సంతోషి.

శిరిపురపు జవహర్‌లాల్ ప్రయత్నం ఆత్మీయమైంది. అభిమాననీయమైంది. జరుగదగిన కృషి ఇప్పటికైనా జరిగినందుకు జవహర్‌లాల్‌ను అభినందిస్తున్నాను.

పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి

# * వేయిరేకుల విరిసింది జలజం *

శతసహస్ర 'ఉదయ కిరణా'ల తాకిడికి వేయిరేకుల విరిసింది (ఈ) జలజం. బహుముఖ పరిశీలనానికి, సాహిత్య దర్శనానికి ఆ విరాట్ స్వరూపం ఎంతో స్ఫూర్తినిచ్చింది, అంతో ఇంతో ఒక స్వరూపమిచ్చింది. ఇదొక సాహితీ అవలోకనం. 'సాహితీ చైతన్య'కు పట్టిన కర్పూర నీరాజనం. సమగ్రం కాకపోవచ్చు కానీ అసమగ్రం కాదు. వారి అడుగు జాడల్లో నేను వేసిన కొన్ని అడుగుల్లో 'విన్నవి-కన్నవి' అయిన కొంత గోగులను మాలకట్టాను.

'శ్రీ గురుభ్యోంనమః' నానుతి. ఒక గురువుగా ఆదరించారు. ఒక సాటి మిత్రునిగా ఎంతో ఆత్మీయత చూపించారు. వారి సుదీర్ఘ సాహిత్య జీవితాన్ని కొన్ని పేజీలలో పరిపూర్ణంగా చూపించడం తేలికయిన విషయంకాదు. కష్టసాధ్యమైనపని. ఈ కృషిలో ఈ కూర్పులో ఈ పేర్పులో ఎందరో మిత్రులు ఎన్నో పుస్తకాలు ఎన్నోసావనీర్లు సహకరించారు. చాలవరకు వారి మాటలను ఉపయోగించుకున్నాను. వారందరికీ పేరుపేరునా నా నమః పూర్వక కృతజ్ఞతలు. అలానే ముద్రణ చేసిన దక్షిణ భారత ప్రెస్సుకు కృతజ్ఞతలు.

పదుల మంది, వందల మంది సమిష్టి కృషికి ఒక చైతన్యవంతమైన మూర్తిత్వం మన సాంబశివరావు గారు.

తరతరాల తెలుగుజాతి, ప్రజ, ప్రాంతం, అభిమానులు గర్వంగా చెప్పుకోదగ్గ చరిత్రకల్గిన వ్యక్తి శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు వారికే ఈ రచన అంకితం. ఇది సమంజసం.

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి విశ్వరూపానికి, వారి పాదపద్మాలకు నా సమః సుమాంజలులు. ఈ పుస్తకంలోని అక్షరాక్షరాలు పసుపద్దిన అక్షింతలు.

—శిరిపురపు జవహర్‌లాల్

# సాహితీ చైతన్య
## శ్రీ పోతుకూచి సాంబశివరావు
# సాహిత్య దర్శనం

# 1

208
న్యూ బోయిగూడ

ఒక వ్యక్తి ఎక్కడ పుట్టాడు ఎక్కడ పెరిగాడు అన్నది ఒక ముఖ్య విషయంగా పరిగణించలేము. కానీ ఒక వ్యవస్థ ఎక్కడ పుట్టింది ఎలా పెరిగంది ఒక నాలుగు గోడల మధ్య నుంచి ఎంతవరకు విస్తరించింది. ఎంతమంది ఆ ప్రదేశంకు వచ్చివెళ్ళారు ఎంతలా పెరిగారు అన్నది ప్రాముఖ్యత స తరించుకున్నది. ఎంతమంది సాహితీస్రష్టలు ఎంతమంది సాహిత్యాభిమానులు అక్కడ ఉద్భవించారు. అన్నది చరిత్ర చెప్పే సత్యసత్యం. నిప్పులాంటి నిజం.

ఆ నాలుగు గోడల మధ్యనుంచి ఒక వ్యక్తి తన సాహిత్య పరిధిని తన సాశ్వత సంస్థను ఎంతవరకు విస్తరింపగలిగాడు. ఎలా విస్తరింప గలిగాడు. అది మేధస్సు కందని విషయం కాదని ఎలా నిరూపించ గలిగాడు.

సాహితీ చైతన్య

రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే కాదు. ఖండ ఖండాంతరాల వరకు తన సంస్థను నడుపుతున్నాడు. ఎలా. అక్కడి నాలుగుగోడలు, ఆమధ్యన లక్షల పుస్తకాలు, ఎన్నో కాగితాల దొంతరలు, ఆ గోడల మీద ఫోటోలు ఎన్నో ఎన్నో చెబుతాయి. సాహిత్యరంగంలో వచ్చిన ఎన్నో ఆటు పోటులు ఎన్నో మార్పులు అవి చెబుతాయి. వాటికి లయగా టైపు మిషను కదలికలు ఎన్నో చెబుతాయి. ఆ వ్యవస్థను అంటిపెట్టుకున్న ఎంతోమంది యువత చెప్పగలరు. నిత్యం అక్కడ సందడి. నిద్ర పోవడానికి, భోజనం చేయడానికి సమయం చాలదు. అనుశృతంగా రోజుకు రోజు వచ్చే మార్పులను తట్టుకుంటూ పెద్దలను అభినందిస్తూ యువతకు చేయూతనిస్తూ అజరామరంగా నిలిచి ఉంది. ఉత్తర ప్రత్యుత్తరాల ఉభయకుశలోపరిలో నిర్విరామ కృషిలో మునిగి ఉంది.

మోగుతున్న ఫోను గణగణలు ఎంతో ఉన్నతమైన సలహాలను ఇస్తున్నవి, ఎంతోమందిని దగ్గర చేస్తున్నవి. వారు వీరని లేదు. సాహిత్య రంగంలో కొత్తగా అడుగుపెట్టిన యువకుడి నుంచి సాహితీస్రష్ట వరకు అది పలుకరిస్తుంది. ఆ చేతుల్సు మీది పుస్తకాల బొత్తులు పలకరిస్తాయి. ఎన్నో పత్రికలు మనలను చదివిస్తాయి. అలా ఎన్నో... ఎన్నో...

పిలవగానే వచ్చి కుశల ప్రశ్నలతో పలకరించే వ్యక్తి [ఒక వ్యక్తి కాదు ఒక మహా వ్యవస్థ. ఆయనను చూస్తుంటే ఒక మామూలు వ్యక్తిలా ఉన్నా ఆయన మేధస్సు మేరు నగమంతది ఆయన ఆలోచన సాగరగంభీర మంతది. ఆయన నిలువెల్లా సాహిత్యం ఉంది. ఆయనలోనే సంస్థ ఉంది. సంస్థ భవిష్యత్తు ఉంది. దేశ విదేశాల వరకు నీరాజనా లందుకునే చిరు నవ్వు ఉంది. శక్తి ఉంది. చేయించగల ధీమా వుంది. కోప మెరుగని

కోటి స్వప్నాలం గని అది. రవ్వంత గూడా చలించదు. నిన్న మొన్న వచ్చిన వారు ఈ రోజు రాకపోయినా చలించని మహాశక్తి అది. ఆయనలో వెదకితే వేల రతనాల మెరుపులు నివురు గప్పిన నిప్పులా ఉంటాయి.

ఆయన కలం ఆ నాలుగు గోడల మధ్య ఎన్నింటికో శ్రీకారాలు చుట్టింది. ఎప్పుడు చూచినా, అది అంతం కాదు, ఆరంభమే అన్నట్లు వ్రాసుకు పోతుంది. వంకరలు పోతుంది. ఎవరికి ఎప్పుడు వ్రాయాలో ఏమి వ్రాయాలో ఆ మేధస్సు ఆలోచిస్తుంది. ఆచేతులు వ్రాసుకుపోతాయి ఎవరి కోసమని కాదు ఎందుకోసమని కాదు. నాలుగు మెట్లెక్కి తన దగ్గరకు వచ్చి తన ప్రతిభను పదును పెట్టుకువెళ్ళే యువత ఉంది. జనత ఉంది. వారు వీరనే కాదు. ఎవరయినా సరే ఏ విషయంలోనైనా సరే తమ ప్రతిభకు గీటురాయిగా వారిని నిర్ణయించుకుంటారు, ఎంతోమంది ఎన్నో వేల రూపాయలు వారు రూపుదిద్దిన ఒక మహా వ్యవస్థకు ఖర్చు చేశారు. ఎందుకని ప్రశ్న లేదు. అది ఒక సమిష్టి వ్యవసాయం. ఎందరో వ్యక్తులు కలసి చెట్టాపట్టాలుగా సాగించిన, సాగిస్తున్న ఒక మహా యజ్ఞం అది. ఒక మహోత్సాహం. ఒక ఉత్పాతం లాగా పెనుతుఫాను లాగా విరుచుకుపడుతుంది అక్కడ ఉంటే ఆ మాటలు వింటే.

ఇది ఒక రోజులో జరగలేదు. ఎన్నో సంవత్సరాల నుంచి జరుగుతున్నది. అది ఎవరి కోసమంటే ఎవరికని చెప్పగలం. తన అభిమానుల కోసమే. తనను అభిమానించే వారు ఎక్కడ ఉన్నా పలకరించగల ప్రేమ ఉంది. ఆసక్తి ఉంది. వారి అభివృద్ధిని కాంక్షించే మనసు ఉంది. వదలి

వెళ్ళిన వారి నయినా రప్పించగల చేవ ఉంది. సత్తా ఉంది. తన స్పర్శతో దీవించగల ఆలోచన ఉంది. స్పృశించగల ఆసక్తి ఉంది,

అవును అక్కడే ఆ వ్యవస్థ ఆయనను సంస్థను తీర్చిదిద్దింది. వేలు లక్షల మందికి హారతులు పట్టింది. అందలాల కెత్తింది. ఆ ఇల్లు ఆ యింటి నంబరు ఇప్పటికీ ఎంతోమందికి పరిచయం. పరిచయమే కాదు ఒక అభిమానం ఒక ఆశీస్సు. అంతేకాదు అండ దండ.

ఆ యిల్లు సికింద్రాబాదు లోని 208, న్యూ బోయిగూడ. ఆ మహా వ్యక్తి మన పోతుకూచి సాంబశివరావు గారు. ఆ మహా వ్యవస్థ మన విశ్వసాహితి.

చైతన్యవంతమైన ఈ మహా సంస్థ ఆవిర్భావమునకు అవకాశము కల్పించిన ఆ మహావ్యక్తి సాహితీ వ్యాసంగ మేమిటి గతం ఏమిటి. ఆ గతం నుంచి రాబోయే భవిష్యత్తరానికి వేసిన వారధి ఈరచన. ఇందులో వారు వ్రాసిన వ్రాతలు వారిసంస్థలు వారి నవ్వులు, వారి నడకలు ఎన్నో అలవోకగా స్పృశించబడ్డాయి. ఇది సాహిత్య దర్శనం. కాదు సాహితీ యాత్రా స్పెషల్.

నవ్య
సాహితీ సమితి
శుభోదయం

ఆ రోజుల్లో హైదరాబాదులో తెలుగు భాషకుకానీ తెలుగు సాహిత్యానికిగానీ తగ్గగౌరవం లభించేది కాదు. అదొక అంధకార బంధురం. పెదవి విప్పి

తీయ తెలుగులో ఒక్క పద్యంపాడ లేదు ఒక్కమాట మాట్లాడలేదు ఆంధ్రసారస్వత పరిషత్తు, శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం మొదలగు సంస్థలు ఎన్ని ఉన్నా పరిస్థితులు మారలేదు. ఈ దశలో తెలుగు భాషకు తెలుగు సాహిత్యంకు తెలుగు సంస్కృతికి తనవంతు సేవచేయడం కోనం శ్రీ పోతుకూచి సాంబశివరావు ఉత్సాహంతో మిత్రులతో కలసి నవ్యసాహితీ సమితి స్థాపనలో కృషి చేశారు.

మొదట రచయితగా జీవితం ప్రారంభించిన శ్రీ పోతుకూచి సామాజికంగా సదుద్దేశ్యంతో నవ్యసాహితీ సమితి స్థాపనలో కృషిచేశారు. ఆ రోజుల్లో ఆచార్య కురుగంటి సీతారామయ్య వంటి ఉద్దండులనుంచి ముక్కుపచ్చలారని నూనూగు మీసాల మామూలు యువరచయితల దాకా అందరినీ సమీకరించాడు. అప్పుడే ప్రారంభమయింది సాహితీ జగన్నాధ రధం

1952లో నవ్యసాహితీ సమితిని కొంతమంది మిత్రులు కలిసి యువకులు ఔత్సాహికులయిన రచయితలతో కలసికట్టుగా ఒక సంస్థ ద్వారా పని చేయాలనే కోరికతో స్థాపించడం జరిగింది. నిజంగాచూస్తే 1952 సంవత్సరం సారస్వత చరిత్రలో ఒక మరపురాని మలుపు. ఉత్సాహవంతులయిన యువకులు శ్రీ పోతుకూచి సాంబశివరావు శ్రీ వేమరాజు నరసింహారావు శ్రీ నిమ్మగడ్డ విశ్వనాధం, శ్రీకాలనాధభట్ట వీరభద్రశాస్త్రి నవ్యసాహితీ సమితిని ఏర్పాటు చేశారు. పేరుకు తగ్గట్టుగా ఈ సంస్థ ఆధునిక సాహిత్య విస్తరణలో ప్రజలలో సాహిత్యాభిరుచి ఇతోధికంగా కలుగజేయాలనే అభిలాషతో రాజకీయ సూత్రాలకు పక్షాలకు సంబంధంలేకుండా, కేవలం సాహిత్య సాంస్కృతిక రంగాలలో సేవచేసే

ఉద్దేశ్యంతో స్థాపించబడింది. దినదినప్రవర్ధమానమై చెప్పుకోదగిన ప్రయోజనాలు సాధించింది. అంతేకాదు తరచుగా సాహిత్యసభలు జరుపుతుండేది. కవులు తమ రచనలను చదువుతుండే వాళ్ళు, కథకులు తమ కథలను చదివేవాళ్ళు. తమ రచనలను ఇతరులు విని ఆనందించి సలహాలిస్తుంటే వాళ్ళకు ఎక్కడలేని ఉత్సాహం కలుగుతుండేది. యువతరం రచయితలకు అప్పుడు-ఇప్పుడు శ్రీసాంబశివరావు కలుగజేసినప్రోత్సాహం అంతాఇంతాకాదు.

ఈ సంస్థలో అనేకమంది కవులు సాహితీవేత్తలు నవలా రచయితలు కథా రచయితలు ప్రఖ్యాతి వహించిన వారినుంచి కొత్తగాకలంపట్టిన వారి వరకు అనేక వందలమంది సభ్యులుగా ఉంటూ వచ్చారు. కీ. శే. ఆచార్య కురుగంటి సీతారామయ్య, శ్రీ బోయిభీమన్న, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ పి. వి. రామణరావు, కీ.శే.వణుకూరి నారాయణరావు వంటి ప్రముఖులు ఈ సంస్థ అధ్యక్షపీఠం అలంకరించి బహుళార్థక సేవల నందించారు. ప్రధాన కార్యదర్శులుగా శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ వేమరాజు నరసింహారావు, శ్రీ తల్లాప్రగ్గడ భద్రిరాజు వంటి సుపరిచితులు సారధ్యం వహించారు. ప్రస్తుతం శ్రీ వేమరాజు నరసింహారావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ శిరిపురపు జవహర్‌లాల్ సారధ్యం వహిస్తున్నారు. (1986-87).

సాహితీ చరిత్రలో నవ్యసాహితీ సమితికి విశిష్టస్థానం ఉంది.యువ తరాన్ని అర్థంచేసుకొని బాధ్యతగల శ్రీ సాంబశివరావువంటి వ్యక్తుల సాహచర్యం లభించినప్పుడే ఏ సంస్థఅయినా సజీవంగా నిలబడగలుగుతుంది. శ్రీ పోతుకూచి వారి ప్రేరణలో ప్రేమలో సాహిత్య సమావేశాలు

ప్రచురణలు పోటీలు మున్నగు కార్యక్రమాలు నిర్వహించి నవ్యసాహితీ సమితి లోకం మన్ననలు పొందింది.

నవ్యసాహితీ సమితి ఉత్తమకథలకు బహుమతులు ఇచ్చేపథకం ఒకటి రూపొందించి కొన్ని సంవత్సరాలపాటు నిర్వహించింది. ఈఎంపిక పోటీ ద్వారా కాకుండా కొన్ని ఉత్తమ పత్రికలనెన్నుకొని అవి ప్రచురించిన కథలనన్నింటిని పరిశోధనాత్మకంగా చదివి కొన్ని కథలనుప్రాథమికంగా తీసుకొని అందులోనుంచి ఒక ఉత్తమకథను ఎన్నుకోవడం దీని ప్రత్యేకత. ఈ పద్ధతిలో రచయిత రచనాత్మక శక్తి యథాతథంగా వ్యక్తీకరింపబడుతుంది. ఈ పోటీలలో నేటి ప్రఖ్యాత రచయితలు శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి ప్రభృతులు బహుమతులనందుకున్నారు. ఇవిగాక కొంతకాలం ఆ సంవత్సరంలో ప్రచురింపబడిన ఉత్తమ కథాసంపుటికి, నాటకానికి, నవలకు, కవితా సంకలనానికి ఆయా రచయితలకు బహుమతులుగూడా ఇచ్చింది.

అంతేకాదు సమితి ఎన్నో కవిసమ్మేళనాలను నిర్వహించింది. పుస్తక విమర్శలను ఏర్పాటు చేసింది. తరువాత తరువాత సంస్థ సభ్యులుగా ఉండి సాహితీలోకంలో గణన పొందినటువంటి ప్రసిద్ధ రచయితల స్మారక కార్యక్రమాలను చేపట్టడం జరిగింది.

సమితి కార్యక్రమ నిర్వహణలో సాహిత్య కార్యక్రమాలతోపాటు ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు కూడా నిర్వహించడానికి ఒక ఉపాంగం ఉండాలనే కోరికతో 1958 సంవత్సరంలో కీ. శే. డా॥ మారేమంద రామారావు అధ్యక్షతలో ఒకనాటకశాఖ ఆరంభమయినది. తరువాత 1963-64 లో నవ్యనాటక సమితిగా రూపుదిద్దుకొంది.

అంతేకాదు కొంతకాలం శ్రీ కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి ఆధ్వ ర్యంలో నవ్యసాహితీసమితి విజయవాడ శాఖను ఏర్పాటు చేయడమైనది. ఇతర ప్రాంతాలలో గూడా సాహిత్యంపట్ల ఒక సద్భావం ఒకచైతన్యం తీసుకురావడానికి ఈ చర్యఎంతో ఉపయోగపడింది.

నవ్యసాహితి సమితి ఆధ్వర్యంలో జరిగిన ప్రథమ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలలో డాక్టరు రాధాకృష్ణ పండితులు సూచించి నట్లుగా పాతలోని మంచిని కొత్తదనానికి జోడించడమే నవ్యసాహితి సమితి ఆశయం. లక్ష్యం.

శ్రీ సాంబశివరావు ఈ లక్ష్యసాధనకై తనదైన బాణిలో నాటి నుండి నేటివరకు నిర్విరామంగా సాహితీసేవలో నిమగ్నమై ఉన్నవిషయం సాహితీప్రియులకు తెలిసిన విషయమే.

నవ్యసాహితి సమితి అణువణువునా అడుగడుగునా శ్రీ సాంబశివ రావు ప్రధాన కార్యదర్శిగా అయనఆలోచన ఉంది, ప్రణాళిక ఉంది, ముద్రఉంది, మూర్తిత్వం ఉంది. స్ఫూర్తి ఉంది. ఇదినిజం.

# 3

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు నవ్యసాహితి సమితి పక్షాన ఎన్నో సాహిత్య కార్యక్రమాలు జరపడమే కాకుండా సంస్థ తరపున ఎన్నో ప్రచురణలను తీసుకువచ్చారు. వైవి

శ్రీ పోతుకూచి సారథ్య సహకారాలతో నాటి ప్రచురణలు

ధ్యం వీరి సొత్తు. అంతే కాదు. ప్రారంభంలో ఏడాదికి ఒక ప్రచురణ అన్నా చేయాలన్న ఆశయం చాలవరకు నిలబెట్టుకున్నారు. ప్రధానంగా తెలుగులో గణనీయములయిన పుస్తకాలు ప్రచురించడం ఈ సంస్థ చేపటి ఎన్నో పుస్తకాలు వివిధ ప్రక్రియలలో ప్రచురించింది.

సంస్థ తరపున ఏ ప్రచురణ చేసినా అవి సమితి సభ్యుల రచనలే. వివిధ మనఃప్రవృత్తులను ఒక్కచోట చేర్చి వైవిధ్యములో ఏకత్వాన్ని సాధించవచ్చునని నవ్యసాహితీ సమితి ఎన్నో మార్లు నిరూపించింది.

కథానికా సంకలనాలు 1. కదంబం (1953), 2. సుమాంజలి (1955), 3. పార్కులో పచ్చ పూలు (1957), 4. జాజిపూలు (1965) ప్రచురించింది. ఆనాటి ఎందరో యువరచయితలకథలు ప్రచురితమైనాయి ఆ రచయితలు ఈ రోజున ఎంతో పెద్ద పేరు తెచ్చుకున్నారు.

ఒక కవితా సంకలనం 'నవ్యసాహితి' (1959)లో ప్రచురించారు ఎంతోమంది ప్రముఖ రచయితల సరసన యువరచయితలు చోటు చేసుకున్నారు. వివిధ రచయితల శైలి రచనా విధానము అవలోకగా దర్శించవచ్చు. వారి కూర్పు నేర్పు శ్రీ సాంబశివరావు గారి సేవా సహకారాలతో తెలుగు ప్రజలకు అందుబాటు లోకి వచ్చాయి. పది కాలాలపాటు తమ పుస్తకాలు అరలలో ఉంచుకొనే అవకాశం కల్పించారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారి శ్రవ్య నాటికల సంపుటి 'ప్రతిధ్వనులు' (1954), అఖిలాంధ్ర పోటీలలో ఉత్తమమయిన నాటికలు 'అయిదు ఏకాంకికలు' (1956) ప్రచురించడం జరిగింది. జనరంజకమైన

దృశ్య నాటికలను శ్రవ్య నాటికలను ప్రచురించి నవ్యసాహితి సమితి తెలుగులో మంచి పని చేసింది.

స్వంత ప్రచురణలే కాక కొన్ని అనుబంధ ప్రచురణలను గూడా నవ్యసాహితి సమితి ప్రచురించింది. అనుబంధ ప్రచురణలంటే రచయితలే తమ పుస్తకాలను ప్రచురించుకుంటారు. కాని సమితి తన పేరును ఇతర సౌకర్యాలను మాత్రము అందజేస్తూ ఉంటుంది. శ్రీ బోయిభీమన్న వ్రాసిన 'భీమన్న కావ్యకుసుమాలు' (కవిత), శ్రీ గోపాల చక్రవర్తి వ్రాసిన 'కలం కలలు' (కవిత), శ్రీ జె. బాపురెడ్డి వ్రాసిన 'చైతన్య రేఖలు (కవిత 1960) ఇలా ఎందరో రచయితలు ఈ అనుబంధ ప్రచురణలతో పాలు పంచుకున్నారు. ఆనాటి నుండి నేటివరకు ఈ అనుబంధ ప్రచురణలను సంస్థ వెలువరిస్తూనే ఉన్నది.

అంతేకాదు. సంస్థ తరపున ప్రతినెల ఒక సమాచార పత్రిక 'నవ్యవాణి' వెలువరించడంతో సభ్యుల సాహితీ ప్రియుల మన్ననలను యితోధికంగా ఆ రోజు నుండి ఈ రోజు వరకు అందుకుంటున్నది. ఈ పత్రికలో యువరచయితల రచనలు ప్రచురిస్తుండే వాళ్ళు ఆ విధంగా కంద గల రచనలు కొన్ని, అలాగే ఇతరత్రా ప్రచురితం కాని రచనలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి. యువతకి నవతకి ప్రాధాన్యత ఇచ్చింది.

నవ్య సాహితీ సమితి ఆధ్వర్యంలో పుస్తక ప్రచురణలు పత్రికా ప్రచురణ ఎంతో సమర్థవంతంగా అతి తక్కువ వెలకు అందజేయడంలో శ్రీ సాంబశివరావు గారి ఆలోచన, కృషి అంతేకాదు సభ్యుల అండదండలు ఎంతో కొనియాడదగినవి.

పుస్తక ప్రచురణలను పదుగురికి అందజెయ్యడం కోసం ఒక పుస్తక పంపిణీ వ్యవస్థను గూడా శ్రీ సాంబశివరావు గారు నిర్వహించేవారు.



## నవలా రచయితగా శ్రీ పోతుకూచి

ఈ శతాబ్దం ఐదవ దశకంలో ఒక ఉత్తమ నవలా రచయిత ప్రజల ముందుకు వచ్చారు. ఆదే ప్రారంభం అతని అనంతయాత్ర ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఉదయ కిరణాలు నవల వారం వారం వరుసగా ప్రచురించేవారు. నవల కోసం పాఠకులు ఆ రోజుల్లోనే ఎదురు చూసేవారు, ఎంతో ఉత్కంఠతో చదివేవారు ఆ రోజులు ఎంతోమంది శ్రీ పోతుకూచి సాంబశివరావును ఉదయ కిరణాలు సాంబశివరావు అని పిలచేవారు. అంతేకాదు. ఆ పేరు వాడుక చేశారు. ఇప్పటికీ మధ్య వయసు వారికి వారి ఉదయ కిరణాలు గుర్తు ఉంది. ఈ తరం వారికి కథలు కథలుగా చెబుతుంటారు.

సాహిత్యం మీద అభిలాషతో చదివే వారందరికీ నవలారచయితగా శ్రీ పోతుకూచి ప్రాముఖ్యత సంతరించుకున్నారు. వారు వ్రాసినవి నాలుగే నాలుగు. ఉదయ కిరణాలు, అన్వేషణ, ఏడు రోజుల మజిలీ, చలమయ్య షష్టిపూర్తి. నాలుగు రకాల ఇతివృత్తాలతో నిండి వున్న ఈ నాలుగు నవలలు శ్రీ సాంబశివరావుకు కీర్తి ప్రతిష్ఠలను సంతరించి పెట్టాయి.

ఒక జీవితాన్ని దాని దృక్పథాన్ని సమగ్రంగా ప్రతిబింబించడమే నవలా లక్షణం. అది సాంబశివరావు గారి నవలల్లో పుష్కలంగా ఉన్నది ప్రతి పాత్ర కథా గమనానికి దోహదం చేసేదిగా ఉంది. సన్నివేశ కల్పనలు, సంఘటనలు అన్ని ఇతివృత్తానికి అనుగుణంగా నడిపించుకుంటూ సాగాయి. సాంబశివరావు గారి నవలల్లో అనవసరమయిన పాత్రలు

అనవసరమయిన సంఘటనలు, సంభాషణలు వర్ణనలు ఏవీ కనబడవు. క్లిష్టమయిన సాంఘిక సమస్యల్ని మనుషుల చిత్ర విచిత్ర మనస్తత్వాలను సమగ్ర దృష్టితో పరిశీలించి విలక్షణమైన విస్మూత్నమైన పద్ధతిలో దృక్పథంతో ఒకదాని ప్రభావం మరొక దానిపై ఎట్లా ప్రసరిస్తుందో శ్రీ సాంబశివరావు తన నవలల్లో వ్యక్తం చేశారు. అందుకనే వాటిలో స్వాభావికత అందరి ఆమోదాన్ని పొందే సామాన్యత గోచరిస్తాయి. వారు సృష్టించిన పాత్రలు మనకు తెలిసి ఉన్నట్లుగాను, కనిపించిన సన్నివేశాలు సహజంగాను నిర్దుష్టంగాను చిత్రీకరిస్తారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారి మొదటి నవల 'ఉదయ కిరణాలు' 1955 లో ఆంధ్రపత్రిక వారు 'సామాన్య కుటుంబ జీవితం' శీర్షికపై నడిపిన పోటీలలో ప్రథమ బహుమతి పొందినది. 76 నవలల్లో ఉత్తమంగా ఎన్నిక కాబడింది. ఈ నవల 1967 సంవత్సరంలో రష్యన్ భాషలోకి అనువాదం చేయబడింది.

సాంబశివరావు గారి చిన్నతనపు జీవితానికి ఉదయ కిరణాలు ప్రతిబింబమనవచ్చు. కొద్దో గొప్పో కల్పన ఉన్నా ఒక లోయర్ మిడిల్ క్లాసు కుటుంబంలో పుట్టిన సాంబశివరావు గారు అంతవరకు అనుభవించిన చూచిన జీవితానికి ఉదయ కిరణాలు నవల అక్షర రూపం కలుగజేసింది. సాంబశివరావు గారు అప్పటికి మానసికంగా పరిపక్వత చెందకపోయినా వారి మానసిక నైర్మల్యమే ఉదయ కిరణాలను ఉత్తమ నవలగా చేసిందనవచ్చు. ఉత్తమత్వానికి ఓనమాలు దిద్దింది అని చెప్పవచ్చు.

ఉదయ కిరణాలు మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబ జీవితం సమగ్రంగా చిత్రించబడింది. సాధారణంగా యువతీ యువకులనే నాయకి

నాయకులుగా చిత్రించడం జరుగుతుంది. కానీ ఉదయ కిరణాలు నవలలో నాయకుని బాల్యం నుంచే ప్రారంభమవుతుంది. ఈ నవలలో మధ్యతరగతి స్త్రీల పాత్రలలో కొందరి సంకుచిత మనస్తత్వం, ఈర్ష్య, అసూయ,లేమి, స్వార్థం, పిసినారితనం, త్యాగం కళ్ళకు అద్దం పడతాయి. ఈ నవలలో ప్రకాశం, సాంబు పాత్రలు మధ్య తరగతి జీవితంలో కష్టాలను ఎదుర్కొంటూ కథాగమనానికి పూర్తిగా పోషకులై పాఠకుల సంపూర్ణ ఆదరణ చూరగొన్న పాత్రలు.

శ్రీ పోతుకూచి సృష్టించిన ఈ నవలలో వాస్తవికత ప్రతి పేజీలో తొణికిసలాడుతూ ఉంటుంది. భావానికి సంఘటనకు తగిన భాషను ఒక ఝరిలా రాయగలిగినపుడే రచనకు ఒక సార్థకత. పాఠకుల హృదయాలను స్పందింపచేసే నవల. విషాదంతో సాహిత్యలోకానికి నిషా ఇవ్వడానికి ప్రయత్నించామని రచయిత చెప్పుకున్నారు.

రెండవ నవల అన్వేషణ. ఈ నవలకు ఇతివృత్తం ఆధునిక సామాజిక చరిత్ర. వర్తమానంలో ప్రజల స్థితిగతులు, సమాజ ప్రాతిపదికయైన కుటుంబ జీవితం వీటిని అడుగడుగునా స్పృశించింది. ఈ నవలకు తెలుగు భాషా సమితి (మద్రాసు) వారి ప్రథమ బహుమతి పొంది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురిత మయింది. ఈ నవలను మద్రాసు విశ్వవిద్యాలయం వారు బి.ఏ.కు ఉపవాచకంగా నిర్ణయించారు. ఈ నవలలో జంటనగరాల వాతావరణం అందులోని మిశ్రమ సంస్కృతి హృద్యంగా చిత్రించబడింది.

తను ప్రేమించిన స్త్రీ ఎవరితోనో లేచిపోవడంతో విరక్తుడై తన వారిని, పుట్టిపెరిగిన ప్రాంతాలను వదలి అదృష్టాన్ని వెతుక్కుంటూ

ఏకాకిగా హైదరాబాదునగరం ప్రవేశిస్తాడు శివరాం. వెంటతెచ్చుకున్న వస్నీ పోగొట్టుకున్న శివరాం అది అపశకునంగా భావిస్తూ నగర ప్రవేశం చేస్తాడు. అడుగడుగునా ఎన్నో ఒడిదుడుకుల నెదుర్కొంటూ స్వయం శక్తితో ఉద్యోగం సంపాదించుకుంటాడు. నాటకాలు వేస్తాడు. తనునటిస్తూ నలుగురికి నటించడం నేర్పుతాడు. సాయంకాలాలలో 'లా' చదువుకుని ఉద్యోగం వదలి లాయరుగా ప్రాక్టీసు మొదలు పెడతాడు. బంధు మిత్రులను ఆదరిస్తూ తద్వారా వారి ఆదరణ పొందుతాడు. కేవలం విధినేనమ్ముకొని చేతులుముడుచుకొని కూర్చోక స్వయంకృషివల్ల సమాజంలో ఉన్నతమైనస్థానంలో తన వ్యక్తిత్వం నిలబెట్టుకుంటూ జీవించగలడనే సత్యం మనకు కనిపిస్తుంది.

ఈ నవలలో శివరాంపాత్ర చిత్రణలో సాంబశివరావుగారి నేర్పు అమోఘం అత్యద్భుతం.

కృష్ణాపత్రికలో సీరియల్‌గా వెలువడిన 'ఏడురోజుల మజిలీ' వీరి మూడవనవల. ఈ నవలలోని కథాగమనం వారంరోజులలోని ఏడుగ్రహాల ప్రభావంవల్ల నడుస్తుంది. అన్నగారి వూరు వెళ్ళి వారంరోజులు గడిపిన శ్రీనివాసు అనుభవాలసారం ఈ నవల. ఇతివృత్తం అంత బలీయమైనది కాకపోయినా ఒకవారంరోజులు గ్రహస్థితినిబట్టి మానవ మానసిక పరిణామాలను మనస్సుయొక్క స్థితిగతులను అద్భుతంగా చిత్రించారు. అంతే కాదు జాల్నా అడవులను పర్వతాలను ప్రకృతిని చక్కగా వర్ణిస్తూ పాఠకుల కళ్ళముందు కదలాడేటట్లు చిత్రించారు. పాత్రల కదలిక కథనం గ్రహప్రభావాల కనుగుణంగా ఉంటుంది. నవలలో కాల ప్రభావం, జ్యోతిష శాస్త్ర పరిణామం వీటిని సమన్వయ పరచి పాత్ర చిత్రణ జరిగింది. ఇది ఒక నూతన చిత్రీకరణగా పేర్కొనవచ్చు.

రాధారాణి, శ్రీనివాసుల ప్రేమకథ నవలలో ఎంతో ఉదాత్తంగా చెప్పబడింది ఒకసారి శ్రీనివాసు రాధారాణికి అతి సన్నిహితంగా రావడం అంతలో రాధారాణి భర్త రావడంతో నైతికంగా దిగజారకుండా ఇద్దరు విడిపోతారు. తరువాత విశ్వజనీన ప్రేమభావంతో నిండి ఆనందమూర్తుల్లా కనిపించాలని ఆశిస్తారు. ఇందులో ప్రతిపాత్ర సజీవమై సంచలితమై మన లను చాలావరకు వెంటాడుతూనే ఉంటాయి. మంచి నవలగా పేరు వచ్చింది.

నాలుగో నవల 'చలమయ్య షష్టిపూర్తి' ఇది పూర్తిగా హాస్య నవల. గ్రామాలలోని రాజకీయాలు, పార్టీలు చలమయ్యకు షష్టిపూర్తి చేస్తామని వెంటబడటం తరువాత వారిలో విభేదాలు ఎంతో హాస్యపూరి తంగా చెప్పబడ్డాయి. మొదటి నుంచి చివరదాకా కథాకథనంలో ప్రతి పాత్ర మనకు నేటి ఆధునిక గ్రామీణ ప్రపంచంలో కనపడే పాత్రలే. కడుపుబ్బ నవ్వించే సంఘటనలతో బాటు సన్మానాల మీద పెరిగిపోయిన కీర్తికండూతి మనలను హాయిగా నవ్విస్తాయి. ఈ నవల విశ్వరచనలో సీరియల్‌గా వచ్చింది.

మరొకటి 'నా జీవితంలో ప్రయత్నాలు ప్రయోగాలు'. ఇది సాంబ శివరావు గారి ఆత్మకథ. నవల లాగా ఎంతో ఉదాత్తంగా వ్రాశారు. వారి జీవితం తొలిదశలోని ఎన్నో సంఘటనలు గోదావరిలా మన కళ్ళకు ఎదురుగా చిత్రీకరిస్తారు. నిజంగా వారి జీవితం నిండు గోదావరంత గంభీరం, నిజం.

కొన్ని సినిమా నవలలు వ్రాశారు. మద్రాసులో కొన్ని నెలలు గడిపి తనదైన బాణిలో, చిత్రంలో స్క్రిప్ట్ ఎవరు వ్రాసినా, సారథీ

స్టూడియోస్ వారి 'కలసి వుంటే కలదు సుఖం', రఘురాం ఫిలింస్ "తండ్రులు-కొడుకులు" చిత్రాలను నవలీకరించారు. పేరు వచ్చింది.

శ్రీ పోతుకూచి చిత్రణా వైచిత్రి ఎంతో మెచ్చుకోదగ్గది. పదుగురు మెచ్చుకున్నది. వీరి రచనలు రష్యన్, జర్మను, హిందీ, ఇంగ్లీషు భాషల్లోకి అనువాదం చేయబడ్డాయి.

ఈ నవలలు శ్రీ సాంబశివరావును నిలబెట్టాయి. వెన్ను తట్టాయి. నవలా ప్రపంచపు మొదటి రోజుల్లో ఒక ఉత్కంఠను పెంచి వారం వారం ఎదురుచూసే అవకాశం కల్పించిన వ్యక్తి మన సాంబశివరావు గారు.

## అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు (1960-81)

దేశభాషల్లో ఒక మహా సంస్కృతిని సంతరించుకున్న తెలుగు భాషలో అద్భుతమైన అపూర్వమైన అజరామరమైన కావ్యాలను రచనలను సృష్టించి ప్రసిద్ధులైన తెలుగు రచయితలు కలసి ఉమ్మడిగా ఉత్సాహంగా జరుపుకున్న అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు ఇంత వరకు ఏడుసార్లు 1960-81 సంవత్సరాల మధ్య కాలంలో మహత్తరంగా మహోన్నతంగా మహాద్భుతంగా జరిగినవి. ఒక మహావ్యక్తి మేధా పటిమ నుండి వెలువడిన ఈ పచ్చతోరణాల మహాత్కార్యం దేశంలోనే తెలుగు

రచయితలకు తెలుగభిమానులకు గొప్పతనాన్ని సంతరించిపెట్టినవి. దేశం లోని వివిధ ప్రాంతాలలో నివసిస్తూ తెలుగు భాషాసాహిత్యాలను పరిపుష్టం చేయడానికి యథాశక్తి కృషిచేస్తున్నవారి నందరినీ ఒకే వేదికపై సమా వేశపరచి, తమ సమస్యలను సాదకబాధకాలను గురించి సాకల్యంగా వాటికి తగు పరిష్కారమార్గాలను కనుగొనడానికి, అవకాశం కల్పించేం దుకు జరిగిన ప్రయత్నమే అఖిలభారత తెలుగు రచయితల మహాసభలు. తెలుగు రచయితల సమస్యలే కాకుండా భాషాసమస్యలు కూడా చర్చించు కోవడంవలన లాభంకలుగుతుందన్న భావమే ఈ మహాసభల ఆశ లక్ష్యం కూడా.

తెలుగుదేశ చరిత్రలో అంతేకాదు తెలుగు సాహిత్య చరిత్రలోనే ఒక నవశకానికి 1960 సంవత్సరం నాంది పలికింది. తెలుగు సాహిత్య జగత్తుకే కీర్తిప్రతిష్టలు సంపాదించే తీరులో ప్రథమ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు యావద్భారత దేశస్థాయిలో తెలుగుల రాజధానీ నగరం హైదరాబాదులో జరిగాయి సమిష్టికృషితో.

1953లో నవ్యసాహితీ సమితి ఏర్పడిన కొద్దికాలంలోనే అఖిలాంధ్ర సాహిత్య సంస్థగా రూపొంది ఈ అఖిలభారత తెలుగు రచయితల మహా సభలకు రూపకల్పన చేసింది. అచంచలమయిన దీక్షా దక్షతలు కలిగి భాష పట్ల, సాహితీ వ్యాసంగం పట్ల ఒక నమ్మకం ఉంచుకొని సహ చర మిత్రుల సహకారంతో ఈ మహాభారంను నడుం కట్టుకొని నిలబడి సభలను తీర్చిదిద్దారు శ్రీ పోతుకూచి సాంబశివరావు. తెలుగురచయితలకు వారి సమస్యలకు ఏదో తెలియని శక్తి అందించిన ఒక మణిహారం కావచ్చు లేదా కొండంత వెలుగు కావచ్చు శ్రీ సాంబశివరావు గారు.

సాహిత్య సభలు ఏర్పాటు చేయడంలోను, నిర్వహించడంలోను తన కార్య దక్షతను ఎన్నో మార్లు రుజువు చేశారు సాంబశివరావు గారు. అఖిల భారత తెలుగు రచయితల మహాసభలుజరపాలని నిర్ణయించినప్పు సభలు దగ్గర పడుతున్న కొద్దీ ఒక పక్క ఉత్సాహం, వేరొకపక్క ఆందోళనతో సతమతమవుతుండే వారు సాంబశివరావు గారు. సభల్లో మొట్టమొదటి సారిగా ఉత్తర దక్షిణ ధృవాల వంటి రచయితలు పాల్గొన డం, తెలుగు వారి కోపం, అందునా రచయితల తాండవం ఎరిగినవాళ్ళకు ఇది సానుకూలపడే విషయం కాదు కార్యకర్తలకు మాట దక్కుతుందా అన్న ఆందోళన ఒకవైపు, ఆర్థికంగా సభలు కార్యకర్తలను ఇర టంలో పెట్టకుండా జరిగిపోతాయా అన్న ఆందోళన ఇంకొకవైపు శ్రీ సాంబశివ రావును ముఖ్యంగా కలత పెడుతుండేవి.

అయితే శ్రీ సాంబశివరావులో ఉన్న దక్షత వల్ల, దీక్షవల్లచక్కని కార్యకర్తలను దగ్గరకు చేర్చుకొని పెద్దలు అనుభవజ్ఞుల మన్ననలతో ఆశీస్సులతో అందరూ మెచ్చుకునే రీతిలో సభలు జరిపించారు సాంబశివ రావు గారు. నాటికి నేటికీ సాహిత్య సభలు పెద్ద ఎత్తున జరపాలంటే 'సాంబశివరావే కావాలి' అన్న మాట వచ్చింది.

నవ్య సాహితి సమితి ఆధ్వర్యంలో మొదటి అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు హైదరాబాదులోని రెడ్డి హాస్టల్ లో నెలకొల్పిన 'సరస్వతీ నగర్'లో 1960 మే 6 వ తేదీ నుండి నాలుగు రోజుల పాటు అతి వైభవంగా జరిగినవి. అప్పటి ఉపరాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధా కృష్ణ పండితుడు మహాసభలను ప్రారంభించారు. అప్పటి ఉత్తరప్రదేశ్ గవర్నరు డా॥ బూర్గుల రామకృష్ణరావు అధ్యక్షత వహించారు. డా॥ బెజ

వాడ గోపాలరెడ్డి గారు పుస్తక చిత్రలేఖన ప్రదర్శనను ప్రారంభించారు. అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య మహా సభల ఆహ్వాన సంఘ అధ్యక్షులుగా ఉండి ఈ ప్రథమ ప్రయత్నం జయ ప్రదం కావడానికి అన్ని విధాల తోడ్పడ్డారు, పద్మభూషణ మాడపాటి హనుమంతరావు గారు 'సరస్వతీ పతాకాన్ని' ఆవిష్కరించి సభలకు బీజం వేశారు.

మహాసభల ప్రారంభంలోనే డా॥ రాధాకృష్ణ పండితుడు కేంద్ర సాహిత్య అకాడమి ప్రచురించిన 'కావ్యమాల' ఆవిష్కరించారు. పన్నెండుగురు సాహితీ స్రష్టలు సన్మానాల నందుకున్నారు. తెలుగు రచయితల పరిచయ గ్రంథం "Who's Who" మొదటిసారిగా ఈ మహాసభల సందర్భంగా వెలువడింది. ఈ మహాసభలలో "సంస్కృత సాహిత్యానికి ఆంధ్రుల సేవ" అన్న అంశంపై చర్చాగోష్టి, తెలుగు భాష, ప్రాచీన తెలుగు సాహిత్యం, దక్షిణాది భాషలను గూర్చి సదస్సులు జరిగాయి. చరిత్ర కళలను గురించిన అంశాలపై సదస్సు, కవి సమ్మేళనం, ప్రతినిధుల సమావేశాలు గూడా జరిగాయి. అన్ని రోజులలోను చివరి కార్యక్రమంగా ప్రముఖ కళాకారుల సాంస్కృతిక ప్రదర్శనలను ఏర్పాటు చేశారు. ఆ నాలుగు రోజులు తెలుగు సరస్వతి నాట్యం చేసిన మువ్వల రవళి దిగంతాలకు వ్యాపించింది. రసజ్ఞులకు శ్రీకృష్ణదేవరాయల వారి కొలువును గుర్తుకు తెచ్చింది. మహాంధ్రోదయం తరువాత అన్ని ప్రాంతాల తెలుగు వారిని తెలుగు రచయితలను ఒక మహాద్భుతంలా ఒకే వేదిక మీదకు తీసుకువచ్చిన ఘనత శ్రీ పోతుకూచి వారిదే. గర్వించదగ్గ తెలుగు సాహితీ ముద్దుబిడ్డ మన సాంబశివరావు గారు. 'విశ్వసాహితి' సాహిత్య సంస్థకు ఉషోదయం జరిగింది.

యావదాంధ్రదేశానికి సాహిత్యపరంగా కేంద్రమైన రాజమహేంద్ర వరంలో రెండవ అఖిల భారత తెలుగు రచయితలు 1963 జనవరి 4,5, 6 తేదీలలో జరిగాయి. అప్పటి కేంద్ర ఆరోగ్యశాఖ ఉపమంత్రి కర్నల్ డి.యస్.రాజు మహాసభలను ప్రారంభించారు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ అధ్యక్షత వహించారు.

చైనా దురాక్రమణ ఫలితంగా ప్రకటించబడిన అత్యయిక పరి స్థితిలో జరిగిన ఈ సభలో 'దేశభక్తి-సాహిత్యం' అనే అంశంపై చర్చా గోష్ఠి జరిగింది. మంత్రి శ్రీ పి.వి. నరశింహరావు అధ్యక్షత వహించారు. "సంస్కృత సాహిత్యానికి ఆంధ్రుల సేవ" అనే విషయంపై జరిగిన గోష్ఠిలో ప్రముఖులు పాల్గొన్నారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అధ్యక్షతలో కావ్య వాఙ్మయసభ జరిగింది. 'కథానిక-నవల'లపై జరిగిన గోష్ఠికి డా॥ గిడుగు వెంకట సీతాపతి అధ్యక్షత వహించారు. 'సాహిత్య విమర్శ' 'నాటక సాహిత్యం'లపై గూడా చర్చాగోష్ఠులు జరిగాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి నిర్వహణలో శ్రీ వేంకటేశ్వర స్వామి వారి పాదసన్నిధిని 1965 మే 30,31, జూన్ 1,2 తేదీలలో మూడవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు జరిగినవి. మహా సభలకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రారంభం చేసినారు. శ్రీ దామోదరం సంజీవయ్య గారు సభలకు అధ్యక్షత వహించినారు.

ఉత్తరాది భాషల సాహిత్యంపై గోష్ఠి జరగడం ఈ సభల ప్రత్యేకత. మరాఠీ, ఒరియా, హిందీ, గుజరాతీ, బెంగాలీ, పంజాబీ రచ యితలు గోష్ఠిలో పాల్గొన్నారు, 'సంఘం-రచయిత' 'ప్రాచీన సాహిత్యం ఆధునిక సాహిత్యానికి ప్రాతిపదిక' 'ప్రాచీన సాహిత్యం (14, 15 శతా

ష్ఠాలలో)' 'నా తొలిరచన' 'విశ్వవిద్యాలయాలలో-విద్యాసంస్థలలో వ్యావహారిక భాష' 'ఆధునిక సాహిత్యం (1950-65)', 'శాస్త్ర పారిభాషిక పద జాలానికి సంస్కృతం ఏ విధంగా దోహదకారి' అనే విషయాలపై చర్చా గోష్ఠులు తరువాత అష్టావధానం. కవిసమ్మేళనం జరిగాయి.

ఈ మహాసభల సందర్భంలోనే అఖిలభారత తెలుగు రచయితల మహాసభల 'జనరల్ కౌన్సిలు' మొదటి సారిగా ఏర్పడి సమావేశమయింది. ప్రధాన కార్యదర్శిగా శ్రీ పోతుకూచి సాంబశివరావు ఎన్నుకోబడ్డారు.

నాలుగవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో 1968 మే 31 జూన్ 1, 2 తేదీలలో జరిగినవి. కేంద్ర రవాణా శాఖామాత్యులు శ్రీ వి. కె. ఆర్. వి. రావు సభలను ప్రారంభించారు. అప్పటి ఒరిస్సా ఆరోగ్య శాఖామాత్యులు తెలుగువాడు, శ్రీ నూతక్కి రామశేషయ్య ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు.

'తెలుగుభాష- నేటి సమస్యలు- అవసరాలు' 'నేటి రచనల్లో క్రొత్త పోకడలు- నాదృక్పథం', 'తెలుగు సాహిత్య విమర్శ- స్వభావ స్వరూపాలు,' 'ప్రాచీన సాహిత్యంలో శాశ్వత విలువలుగల గ్రంథాలు ఉన్నట్లుగా ఆధునిక సాహిత్యంలో ఉన్నాయా' అనే విషయాలపై గోష్ఠులు, భారతీయ భాషల సదస్సు, తరువాత కవి సమ్మేళనం వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి.

ప్రతినిధులుగా విదేశంలోని ఆంధ్రులు కొందరు విచ్చేయడం ఈ మహాసభల ప్రత్యేకత. మారిషస్ ఆంధ్ర మహాసభ పక్షాన శ్రీయుతులు

రామయ్య, రామవృడు, గున్నయ్య ఒట్టి గారలు ఈ మహాసభలకు ప్రతినిధులుగా హాజరయ్యారు.

ఐదవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు తిరిగి హైదరాబాదులోనే 1971 మే 30, 31 జూన్ 1వ తేదీలలో జరిగాయి. డా॥ సూరి భగవంతం సభలను ప్రారంభించారు. వివిధ సాహిత్య విషయాలపై జరిగిన చర్చా గోష్ఠులలో పండితులు రచయితలు పెద్దలు పాల్గొన్నారు. సభలలో మారిషస్, ఫిజీదీవుల నుండి వచ్చిన తెలుగు ప్రతినిధులకు ముఖ్య అతిథిగా వచ్చిన అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ మెమెంటోలు అందజేశారు.

అయిదు సార్లు తెలుగుదేశంలో జరిగిన అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు ఆరవసారి, పొరుగురాష్ట్రమైన కర్నాటక లోని బెంగుళూరులో 1974 అక్టోబరు 18, 19, 20 తేదీలలో అతివైభవంగా జరిగాయి. మాజీ రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి ముఖ్య అతిథిగా విచ్చేశారు. కర్నాటక రెవిన్యూ మంత్రి శ్రీ హస్తిమళ్ళగౌడ సభలను ప్రారంభించారు.

సభలలో 'తెలుగుభాషా పరిణామం- నేటి అవసరాలు,' 'ఆధునిక సాహిత్యం- విశ్వజనీనత' 'సినిమా-సాహిత్యం', 'ఇతరభాషల్లోని తెలుగు సాహిత్యం,' 'తెలుగు కన్నడ సంబంధాలు', 'రచయితలు సిద్ధాంతాలకు కట్టుబడి ఉండాలా' అన్న విషయాలపై చర్చాగోష్ఠులు జరిగాయి. దక్షిణ భాషాసదస్సు కవి సమ్మేళనం జరిగినవి.

అక్టోబరు 19వ తేదీన అప్పటి కర్నాటక రవాణామంత్రి శ్రీ కె. రంగనాధ్ అధ్యక్షతన కీ. శే. దామోదరం సంజీవయ్య స్మారక సభ జరిగినది.

మహా సభలలో 'కన్నడ తెలుగు సంబంధాలు' పుస్తకాన్ని డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి ఆవిష్కరించారు.

ఏడవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు శ్రీ గురజాడ అప్పారావు గారి సాహిత్య కార్యకలాపాలకు ఆటపట్టయిన విశాఖ పట్నంలో 1981 అక్టోబరు 14, 15, 16 తేదీలలో జరిగినవి. శ్రీ దేవుల పల్లి రామానుజరావుగారు మహాసభలకు అధ్యక్షత వహించినారు. 'తెలుగు-భారతీయ భాషలు' మున్నగు వివిధ అంశాలపై సదస్సులు గోష్ఠులు ఏర్పాటు చేసినారు.

1961 నుంచి 81 వరకు జరిగిన ఏడు మహాసభలలోను తెలుగు సాహిత్య వికాసానికి, రచయితల పురోభివృద్ధికి దోహదం చేయగల అనేక తీర్మానములు ఆమోదించబడినవి. వీటి అమలు విషయంలో పూర్తి ఫలితాలకోసం ఇంకా ఎంతో కృషి చేయవలసి ఉంది. పరిమిత సాధన సంపత్తుతో ప్రతిసభనూ ఒక ప్రత్యేకత కలిగినదిగా రూపొందించడానికి ఎంతో కృషి జరిగినది. రచయితల మహాసభల ప్రయోజనాన్ని ఎవరు ఎంత శంకిస్తునప్పటికీ వాటి ప్రభావం సాహిత్యం పైన రచయితలపైన కొంతవరకైనా ఉండి తీరుతుందనడం నిర్వివాదాంశం. శ్రీ పోతుకూచి వారు పేర్కొన్నట్లు 'సాహితీవేత్తలు, సాహిత్యాభిలాషులు పోషకులు వందల సంఖ్యలో ఒకచోట చేరి సుహృద్భావ వాతావరణంలో చర్చలు, సమాలోచనలు జరిగినప్పుడు సిద్ధించగల ప్రయోజనాలను సత్ఫలితాలను

గురించి వేరే చెప్పనవసరం లేదు. దీనిదృష్ట్యా ప్రతి రచయితల మహాసభ సఫలీ కృతమైనదే.'

## 6

### Who's who ప్రచురణ

పాతికేళ్ళ వెనక రచనా వ్యాసాంగంలో పెద్దలు అప్పుడే అడుగుపెట్టిన వర్ధమాన రచయితలను ఒక పుస్తకంలో ఏర్చి కూర్చి వారందరికీ పెద్ద పీటవేసి ఒక్క వేదిక మీదకు చేర్చిన ఘనత శ్రీ పోతుకూచి సాంబశివ రావు గారిది.

ప్రథమ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు హైదరాబాదులో 1960 మేనెల ఆరవ తేదీనుంచి నాలుగురోజులు ఒక అద్భుతంగా ఒక మహోత్సవంగా జరిగినపుడు ఇంగ్లీషుభాషలో శ్రీ వేలూరి సహజానంద సంపాదకత్వంలో నవ్య సాహితి సమితి ప్రచురణగా 'who's who' వెలువరించడమైనది. ఎందరో రచయితలు అందులో చోటు చేసుకున్నారు. వారి వయసు వారి చిరునామా వారి రచనలు వారి అభినివేశం ఎన్నో విషయాలు ప్రతి ఒక్కరి గురించి చెబుతాయి.

ఈ ప్రచురణ మొట్టమొదటగా ఎవరూ ఎప్పుడూ తయారు చేయనంతగా వెలువడడం ముదావహం, ప్రధాన కార్యదర్శిగా శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు దీని ప్రచురణ విషయంలో తీసుకున్న శ్రద్ధ అభివందనీయం. అభిలషనీయం.

ఇందులో ప్రచురించిన రచయితలు వారి వివరములు సమగ్రమైన వని పరిపూర్తి చెందినవని చెప్పలేకపోయినను ఒక గొప్ప ప్రచురణ గారావడం ఒక గొప్ప విషయం. చాలా గొప్ప విషయం, చాలా తక్కువ వ్యవధిలో తయారు చేయడం వలన కొంతమంది వ్యక్తులను వదలివేయుట జరిగి ఉండవచ్చు. కాని అసమగ్రం కాదు. కావాలని చేసి ఉండక పోవచ్చు. ఏది ఏమైనా తృప్తికరంగా జరిగిన ఒక మంచి కార్యం. ఈ కృషిలో పాలు పంచుకున్న శ్రీ సహజానంద గారివ్వండి, శ్రీ సాంబశివ రావు గారివ్వండి అభినందనీయులు. దేశంలో జరిగిన ఒక గొప్ప ప్రశంశకు ఇది నాంది మాత్రమే అని చెప్పవచ్చు. ప్రథమ ప్రయత్నమని చెప్ప వచ్చు.

# 7

## విశ్వసాహితి

1960 లో అఖిల భారత తెలుగు రచయితల ప్రథమ మహాసభలు హైదరాబాదులో జరిగినపుడు ఆమోదించిన తీర్మాన ఫలితంగా 'ఆంధ్ర విశ్వసాహితి' అవతరించినది. ఈ సంస్థ చేయవలసిన ముఖ్య కార్యక్రమాలను నిర్ణయించారు.

ఉత్తమ తెలుగు సాహిత్యమును ఇతర భారతీయ మరియు విదేశీ భాషల లోకి అనువదించి ప్రచురించుట అంతేకాదు ఇతర భాషా సాహిత్యాన్ని తెలుగు వారికి పరిచయం చేయుట ఈ సంస్థ లక్ష్యముగా నిర్దేశిం

చిరి. మన సంస్కృతిని కూడా ప్రపంచ ప్రజలకు తెలియజేయాలని నిర్ణ యించిరి. సంస్థ సారథ్యమును మన సాంబశివరావు గారు చేపట్టి ఉత్తుంగ తరంగ సదృశమైన భావావేశముతో తన కార్యకలాపములతో ప్రజలలో చైతన్యం తీసుకువచ్చారు.

ఎన్నో కొత్త కార్యక్రమములతో ఆంధ్ర విశ్వసాహితి ప్రజల ముందుకు వచ్చింది. తెలుగు సాహిత్యాన్ని ప్రధానంగా ఇంగ్లీషు హిందీ భాషలలోను తరువాత తరువాత ఇతర భాషల్లోకి అనువదించి ప్రచురించా లని నిర్ణయించారు. నవీన సాహిత్యాన్ని ప్రోత్సహించుటకై రచయితలకు ఆర్థికంగాను అవసరమయితే ఇతర విధములు గాను సహాయము చేయు టకు నిర్ణయించారు. సాహిత్య సాంస్కృతిక నాటకరంగ సంస్థలకు ఆర్థి కంగా సహాయం చేయుటకు నిర్ణయించారు. ప్రజలలో తెలుగు సాహిత్య పుస్తకాలు కొని, చదవడంపట్ల ఉత్సాహం కలిగించుటకు ప్రయత్నించారు. వివిధ ప్రాంతాలు పర్యటించి అక్కడి ప్రజల జీవన విధానము పరిశీలించి వాటి నుంచి కొంత నేర్చుకుని సాహిత్యంలో కొత్త కొత్త పద్ధతులను సృష్టించగల చేవను రచయితలకు కలుగజేశారు. ఎప్పుడైనా సరే తెలుగు సాహిత్యాన్ని తక్కువ ధరకు అందజేయుటకు నిర్ణయించారు. తన ఆశయ సాధనకు సరిపడే కార్యక్రమాలను ఏర్పాటు చేయడం జరిగింది అంతే కాదు. తన ఆశయాలను ప్రతిఫలించే కార్యక్రమాలు ఏర్పాటు చేసే ఇతర సంస్థలకు గూడా సహకారము అందజేయడం జరిగింది.

25 సంవత్సరముల సంస్థ చరిత్రను పరిశీలిస్తే మొదటి రోజున తాను నిర్దేశించుకున్న లక్ష్యాలను సాధించిన గొప్పతనంను గుర్తించి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆర్థికంగా ఎన్నోమార్లు సహాయ సహకారా లందిం చింది.

సంస్థ తరపున ఇంగ్లీషులో ప్రచురిస్తున్న UNILIT పత్రిక నిర్దేశించిన లక్ష్యాలను అధిగమించుటకు ఎన్నో విధాలుగా సహకరించింది. సంస్థ ప్రచురిస్తున్న విశ్వరచన దినపత్రిక, విశ్వరచన పక్షపత్రికలు సభ్యులకు ప్రజలకు ముఖ్యంగా యువతకు చేయూత నిస్తున్నవి.

1979 లో విశ్వసాహితి కార్యాలయంలో "గ్రంథాలయం" ప్రారంభించబడింది. మాజీ మంత్రిణి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య ప్రారంభోత్సవం చేస్తూ గ్రంథాలయంలో వివిధ భాషల గ్రంథాలు ఉండటం వలన విశ్వసాహితి సభ్యులకే గాక పరిసర ప్రాంతీయులక్కూడా చక్కని అవకాశమని చెబుతూ తమ సంతోషాన్ని వెలిబుచ్చారు.

అనేక విదేశీ రచయితలతోనూ, పత్రికాధిపతులతోనూ, వివిధ విదేశీ ప్రచురణకర్తలతోనూ విశ్వసాహితి సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకున్నది.

విదేశీ తెలుగు సంస్థలతో సంబంధ బాంధవ్యాలను అనవరతము నిలుపుకుంది. వారితో గల స్నేహ సముచ్ఛయం అఖిల భారత తెలుగు రచయితల మహాసభలలో ప్రతిఫలించింది.

విశ్వసాహితి సమావేశాలలో శ్రీ పోతుకూచి ఎంతో మందికి సన్మానాలు సత్కారాలు జరిపారు. ఏ రంగంలో నయినా ఎవరి కయినా ఒక గుర్తింపు సమాజ పరంగాను ప్రభుత్వపరంగాను వచ్చినపుడు అభినందన సభలు ఏర్పాటు చేశారు. సత్కరించారు.

ఎంతోమంది రచయితలు మిత్రులు తమతమ రచనలను శ్రీ పోతుకూచి సాంబశివరావుకు అంకితం చేసి తమ ప్రేమను అభిమానంను పేర్కొన్నారు.

ఎంతో మంది రచయితలు తమ పుస్తకావిష్కరణలకు వేదికగా విశ్వసాహితిని ఎన్నుకున్నారు.

విశ్వసాహితి అధ్వర్యంలో కథల పోటీలు, కవితల పోటీలు జరిగాయి. యేటేటా ఏదో సందర్భంలో ఎంతో గొప్పగా జరిగాయి. విజేతలను ఘనంగా సత్కరించింది, ఈనాడు ఉన్నత స్థానంలో ఉన్న శ్రీమతి పవని నిర్మల ప్రభావతి, శ్రీమతి డి. కామేశ్వరి మున్నగువారు ఆ రోజుల్లో విశ్వసాహితి పోటీలలో పాల్గొనినవారే. హాస్య కథానికల పోటీలను నిర్వహించింది. మినీ కథల పోటీలను నిర్వహించింది. ఉగాదికి దీపావళికి ఇతర ముఖ్యమైన సందర్భాలలోను కవితల పోటీలను ఏర్పాటు చేసింది. కవిసమ్మేళనాలను ఏర్పాటు చేసింది. 1986 లో కవిసమ్మేళనం పోటీలు ప్రయోగాత్మకంగా నిర్వహించింది. శ్రీ పోతుకూచి అధ్యక్షత వహిస్తూ ఈ కవిసమ్మేళనం పోటీలు కవులను ప్రోత్సహించడానికి, వారి కొత్త ప్రతిభ అభివృద్ధి చేయడానికి ఉపయోగ పడతాయన్నారు.

1982 సంవత్సరంలో ఉత్తమ రేడియో నాటికగా ఎంపిక అయిన "దేవుడిచ్చిన వరం" రచయిత శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుకు గోరా శాస్త్రి అవార్డు 1983 లో ఇచ్చి సత్కరించారు.

ఇలా ఎన్నో కార్యక్రమాలు వేనవేలుగా జరిపారు శ్రీ సాంబశివరావు గారు. యువతరం కార్యకర్తల అండతో పెద్దల సహాయ సహకారాలతో సభలు నిర్వహించారు. సమావేశాలు నిర్వహించారు. ఏ మంచి ఆలోచన వచ్చినా దానికి ఒక రూపం దిద్ది ఒక ఆకృతి చేర్చి గొప్పగా నలుగురు చెప్పుకొనేంత ఘనంగా వాటిని నిర్వహిస్తున్నారు.

# 8

## భారతీయ భాషా మిత్రులతో సమావేశాలు

విశ్వసాహితి సమావేశాలకు ఎందరో భారతీయ భాషా వేత్తలను సాహిత్యకారులను ఎందరినో ఆహ్వానించి వారిచే స్నాతకోపన్యాసాల నిప్పించారు. ముఖ్య అతిధులుగా ప్రసంగాలు చేయించారు.

1970లో ఆంధ్ర విశ్వసాహితి దశమ వార్షికోత్సవాలలో ప్రఖ్యాత జర్నలిస్టు శ్రీ కుష్వంత్‌సింగ్ పాల్గొని ఉత్సవాలకు వన్నెతెచ్చారు. గొప్ప ప్రసంగం చేశారు.

విశ్వసాహితి 16వ వార్షికోత్సవాల సందర్భంగా ప్రముఖ గుజరాతీ రచయిత శ్రీ గులాబ్‌దాస్ బ్రోకర్ హాజరయి ఉత్సవాలను ప్రారంభించారు. బహుభాషా కవిసమ్మేళనంలో వివిధ భాషల ప్రముఖ కవులు కవిమిత్రులు పాల్గొన్నారు (1976).

విశ్వసాహితి ఆధ్వర్యంలో (1976) జరిగిన నాటక ప్రియుల సమావేశంలో శ్రీ అరసు, శ్రీమతి ఉషా అరసు ముఖ్యఅతిధులుగా విచ్చేసి మద్రాసులో తాము చేస్తున్న నూతన ప్రయోగాలను గూర్చి వివరించారు.

ప్రఖ్యాత పంజాబీ రచయిత శ్రీ గురుముఖ్‌సింగ్‌జీత్, కన్నడరచ

యిత శ్రీ సి. కె నాగరాజారావు హైదరాబాదు (1979) వచ్చిన సంద ర్భంలో వివిధ రచయితలతో ఇష్టాగోష్ఠీ సమావేశాలను ఏర్పాటుచేశారు.

1981లో అఖిల భారతీయ భాషాసాహిత్య సమ్మేళన్ ఆంధ్ర ప్రదేష్ విభాగం కళాభవన్‌లో డా॥ బెజవాడ గోపాలరెడ్డి ప్రారంభించారు. మన ఆంధ్రప్రదేష్ విభాగంకు అధ్యక్షులుగా శ్రీ పోతుకూచి సాంబశివ రావు ఎన్నికకావడం మనందరికీ గర్వకారణమే.

విశ్వసాహితి 24వ వార్షికోత్సవాలకు (1984) ముఖ్య అతిధిగా విచ్చేసిన ఆలిండియారేడియో స్టేషను డైరెక్టరు కుమారి లీలాబేదకర్ ప్రసంగిస్తూ భాషాసాహిత్యాలు జాతీయ సమైక్యతకు దోహదం చేస్తాయని అందువల్ల రచయితలు పరస్పర అవగాహన కలిగేలా అనువాదాల ద్వారా సాహిత్యకృషి చేయాలని, ఈ దిశలో పయనిస్తూ భారత జాతీయతకు భారతసమైక్యతకు శ్రీ పోతుకూచి సాగిస్తున్న సాహిత్యకృషిని ప్రశం సిస్తూ, 'సాహితీవిహంగం'గా అభివర్ణించారు.

విశ్వసాహితి ఆధ్వర్యంలో (1984) జరిగిన సమావేశంలో ప్రఖ్యాత తమిళ కవి శ్రీ సుబ్రహ్మణ్య భారతి గురించి డా॥ మాణిక్యం ప్రసం గించారు.

ఒక విశ్వసాహితి సమావేశంలో (1985) ప్రముఖ ఇంగ్లీషు రచ యిత శ్రీ R P. భట్నగర్ తమ ఆంగ్ల కవితలను చదివి జన సమూ హాన్ని రంజింపచేశారు.

మరొక విశ్వసాహితీ సమావేశంలో (1986) శ్రీ S. V. సుబ్ర హ్మణ్యం (మద్రాసు) ఇటీవల ఢిల్లీలో జరిగిన భారతీయ రచయితల మహా సభలగురించి విస్తృత ప్రసంగం చేశారు.

ఇలా ఎన్నో. భారతీయ భాషల సాహిత్యబంధుగా భారతీయ భాషాసాహిత్యాలతో పేరుపొందిన ఎందరినో విశ్వసాహితి సమావేశాలకు తీసుకువచ్చారు. దేశసమైక్యతకు వీరు ఒక ప్రతిరూపం. ప్రగతికి ఒక వ్యాసంగం.

# 9

## విశ్వసాహితి ప్రచురణలు

విశ్వసాహితి ఎన్నో ప్రచురణలను తీసుకువచ్చింది శ్రీ పోతుకూచిసాంబ శివరావు ఆధ్వర్యంలో వారు చేపట్టిన ఈ కార్యక్రమం ఒక గంగా ప్రవాహం లాంటిది. ఆగదు. తక్కువ ధరకు ఒక మంచి పుస్తకాన్ని అందించా మన్న తృప్తి వారికి, చదివామన్న ఆనందం మనకు వారు ఎన్నో విధాలుగా ప్రయత్నాలుచేసి ఆ అవకాశాలు కలుగజేశారు. ప్రశంసా పాత్రు లయినారు.

విశ్వసాహితి తమసభ్యుల పుస్తకాలను ప్రచురించింది. అనుబంధ ప్రచురణలుగా అనేక సహాయసహకారాలందించి ఎందరివో, ఎందరికో పుస్తక ప్రచురణ అవకాశములు కల్గించారు.

డాక్టరు పి. వి. రెడ్డిగారి కథల పుస్తకం 'జీవన రేఖలు' కవితల సంకలనం 'తరంగాలు' శ్రీ కోకారాఘవరావుగారి 'శిల్పి' గేయ సంకలనం శ్రీ ఆవాల దామోదరరెడ్డిగారి కవిత 'గానడోల', రుద్రశ్రీ కవితల

సంకలనాలు 'ఇంద్రచాపం', 'అరాత్రికం', అన్నపూర్ణ కృష్ణగారి కథల సంపుటి 'గులాబీలు', కుమారి M.L. శేషాబాయిగారి 'కనిపించినదేవుడు' కవితల సంకలనం, శ్రీమండవ శ్రీనివాసరావుగారి 'ఆణిముత్యాలు' ఇలా ఎందరివో అనుబంధ ప్రచురణలుగా ప్రచురించారు.

శ్రీ సాంబశివరావుగారి పుస్తకాలను ఎన్నో విశ్వసాహితి ప్రచురణలుగా ప్రకటించారు. శ్రీ రుద్రశ్రీ వ్రాసిన 'సాంబశివానందలహరి' మీద వ్యాఖ్య, శ్రీశైలం వ్రాసిన 'పోతుకూచీయం'మీద వ్యాఖ్య ప్రచురించారు.

డిసెంబరు 1976లో విశ్వసాహితి ప్రచురించిన 'ఉదయాంజలి' లో ఒక నూతన ప్రచురణ పద్ధతి ప్రవేశ పెట్టబడినది. అదేమిటంటే యువరచయితలందరూ సహకార పెట్టుబడిద్వారా తమ రచనలను చేర్చి ప్రచురించడం. ఆ విధంగానే తాము పెట్టిన సొమ్ముకు తగిన కాపీలను రచయితలు స్వీకరించడం. ఈ పద్ధతి ప్రవేశపెట్టడానికి రెండుకారణాలున్నాయి. ఒకటి పత్రికల్లో ప్రచురింపబడటం లేదన్న యువరచయితల నిరాశా నిస్పృహలు ఇటువంటి ప్రచురణలతో చాలవరకు పరిష్కారమవుతాయి. రెండవది యువరచయితలు పెట్టుబడిలోనే కాకుండా అమ్మకంలోను భాగస్వాములు కావడంవల్ల ప్రచురణల్లో ఉండే ఇబ్బందులు, వాటి మార్కెటింగు అవకాశాలు అవగతమవుతాయి. ఈ సంపుటిలో సుమారు ఇరవై మంది రచయితలు సహకారపద్ధతిలోనే తమ రచనలను ప్రచురించారు. ఇదే సహకారపద్ధతిలో విశ్వసాహితికి అనుబంధమయిన ఆంధ్ర ప్రదేశ్ యువరచయితల మహాసభల సమాఖ్య 1982-83లో 'మణికిరణాలు' కథల సంపుటిని ప్రచురించింది. పదిపదిహేనుమంది యువరచయితలు ఎన్నో ప్రయాసలకోర్చి సంస్థ సహకారంతో ఈ కథాసంపుటాన్ని ప్రచురించారు.

నిజంగా చెప్పాలంటే శ్రీ పోతుకూచి ద్వారా ఎంతోమంది యువ రచయితలు పైకివచ్చి నేడు ప్రముఖ రచయితలు రచయిత్రులుగానూ పేరు తెచ్చుకుంటున్నారు.

మంచి తెలుగుకథలకు అనువాదాలను ప్రచురిస్తూ హిందీభాషలో డా॥ భీమసేన్ నిర్మల్‌గారి 'హిందీకి-అచ్ఛీకహానియాఁ' వెలువరించారు.

అఖిల భారత తెలుగు రచయితల మహాసభలలో వెలువడిన ఎన్నో ప్రసంగాలను ఏర్చికూర్చి 'తెలుగు రచయితల సభలు- ప్రసంగాలు'అన్న పుస్తకం వెలువరించారు. అఖిల భారత తెలుగురచయితల మహాసభలు బెంగుళూరులో జరిగినపుడు కన్నడ తెలుగు భాషలలో వ్యాససంకలనం 'కన్నడ తెలుగు సంబంధాలు' వెలువరించారు.

ఆంగ్లభాషలో శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారి 'టేల్స్ ఫ్రంతెలుగు' కథల పుస్తకం, శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి వ్యాససంకలనం 'మోడరన్ తెలుగు లిటరేచర్ అండ్ థియేటర్', కథలపుస్తకం 'ఆఫీసరు అండ్ మిల్క్ మెయిడ్' వెలువరించారు. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు తమ మేధాశక్తితో సాహచర్యంతో వివిధ రచయితలను ప్రోత్సహించి ఎన్నో ఎన్నో వెలువరించారు.

ఎన్నో సావనీర్లు ప్రతి మహాసభలలోను ప్రకటించారు. ఎన్నో బ్రోచర్లను వెలువరించారు. ఎన్నో మలుపులలో ఎంతో ప్రశంశనీయంగా ఎన్నో అవకాశాలలో ఎంతో ఆకర్షణీయంగా, ఉత్తమంగా, ఘనంగా వెలువరించారు.

# 10

## విశ్వసాహితి దశమ వార్షికోత్సవములు

విశ్వసాహితి చరిత్రలో 1970లో జరిగిన దశమ వార్షికోత్సవములు ప్రాముఖ్యత సంతరించుకున్నవి. తెలుగు వారి సాహిత్య సాంస్కృతిక రంగాలలో విశ్వసాహితి అనేక విషయాలకు కొత్తదనంకు ముందున్నది.

తన ఘనమైన దశమ వార్షికోత్సవాలను ఎంతో గొప్పగా ఎంతో హుందాగా ఏర్పాటుచేసి తెలుగు వారికి తన మహోన్నతమైన ఉనికిని తెలియబరచింది. తద్వారా తెలుగువారి ఆశీస్సులను అందదండలను సంతరించుకొంది. ప్రత్యేకతకలిగిన సంతోష సమయాన్ని సభ్యులతో ప్రజలతో కలసి పంచుకొంది.

ముందు చెప్పుకోవాల్సిన ముఖ్య విషయం దశమ వార్షికోత్సవాలను ఆనాటి భారత రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి గారిచే ప్రారంభింపజేయడం గర్వకారణంగా భావిస్తున్నారు. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు విశ్వసాహితికి అందించిన కలికితురాయిగా ఈ మధురక్షణాలు గుర్తు చేస్తున్నాయి.

ప్రముఖ రచయిత, విద్యావేత్త న్యాయమూర్తి శ్రీ గోపాలరావు ఎగ్బోటేగారు దశమ వార్షికోత్సవాల ప్రారంభ సమావేశాలకు అధ్యక్షత

వహించారు. వీరు విశ్వసాహితి ఏర్పరచిన అనేక కార్యక్రమాలలోపాల్గొని తన సహకారాన్ని మరింతగా అందించిన వ్యక్తి.

ఆనాటి రాష్ట్ర హోంమంత్రి శ్రీజలగం వెంగళరావు వార్షికోత్సవాలలో స్నాతకోపన్యాసం చేయడం మరోముఖ్యవిషయం. ఆనాటి రాష్ట్ర రెవెన్యూ మంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి మన ఆంధ్ర విశ్వసాహితి చైర్మనుగా వ్యవహరించి దశమ వార్షికోత్సవములు సజావుగా సందర్భోచితంగా చక్కగా జరగడానికి అవకాశము కలిగించారు.

తన రచనలతో తన వ్యక్తిత్వంతో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఉత్తమ జర్నలిస్టు శ్రీ కుష్వంత్ సింగ్, తెలుగు సాహిత్యంలో విశేష పేరు ప్రఖ్యాతులు పొందిన ప్రముఖ హాస్య రచయితలు శ్రీ ముని మాణిక్యం నరసింహారావు, శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రి మరియు సుప్రసిద్ధులు శ్రీ దేవులపల్లి రామానుజ రావు, డా॥ దివాకర్ల వేంకటావధాని దశమ వార్షికోత్సవాల సందర్భంగా జరిగిన వివిధ సాహిత్య సమావేశాలలో పాల్గొని సభలకు ఎంతో గొప్పదనాన్ని ఆపాదించారు.

అంతే కాదు ఆ రోజుల్లో ప్రసిద్ధులయిన రచయితలు స్రష్టలు శ్రీయుతులు డా॥ కె. వి. రావు, జి. వి. కె. మూర్తి, రామవేంద్ర ఇటిగి, తురగా కృష్ణమోహనరావు, కుందుర్తి, ఎ. ఆర్. కృష్ణ మొదలగు వారు ఎందరో పాల్గొని సమావేశాలకు ఎంతో హుందాతనాన్ని తీసుకువచ్చారు.

దశమ వార్షికోత్సవాల సందర్భంగా ప్రపంచంలో వివిధ వ్యక్తుల రచనలను పొందుపరుస్తూ UNILIT ప్రత్యేక సంచికను వెలువరించడం జరిగింది.

తన పరిణతి చెందిన పాటవముతో శ్రీ సాంబశివరావు దశమ వార్షికోత్సవాలను శోభాయమానంగా ఒక యాద్‌గార్‌గా నిర్వహించారు.

# 11

## మహోన్నతంగా విశ్వసాహితి రజతోత్సవములు

ఆగస్టు 1986 నుంచి ఆగస్టు 1987 వరకు విశ్వసాహితి రజతోత్సవములు జరుపుటకు నిర్ణయించినపుడు సభ్యులు అభిమానులు ఎంతో సంతోషించారు. సహాయ సహకారాలు విస్తృతంగా అందించారు.

చైతన్యవంతంగా పనిచేసే స్వచ్ఛంద సంస్థల సేవ చాల అవసరమయిన సమయంలో, పాతిక సంవత్సరములు విశ్వసాహితి సంస్థను నిరాఘాటంగా ప్రజల సహకారంతో నిర్వహించడం ఒక అపూర్వమైన విషయము. ఒక అద్భుతమైన సంఘటన.

మొదటి కార్యక్రమం 1986 ఆగస్టు నెలలో 16వ తేదీ ప్రారంభమయింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ గోగినేని రాధాకృష్ణరావు రజతోత్సవాలను ప్రారంభించారు. ముఖ్య అతిథులుగా ప్రఖ్యాత నాటకకర్త సినీ దర్శకులు శ్రీ డి. వి. నరసరాజు గారు విచ్చేసినారు.

సంస్థ పురోభివృద్ధికి సహాయ సహకారాలందజేస్తూ, ఎంతో కృషిచేసిన సహచర మిత్రులకు పోషకులకు రజతోత్సవ సందర్భంలో

మెమోంటోలు అందజేసారు. కుమారి మీరా భారతి బృందం చివరలో జాన పద నృత్యాలు ప్రదర్శించారు.

రెండవరోజు 86 ఆగస్టు 17వ తేదీన ఎంతో అట్టహాసంగా మహోన్నతంగా 'కవితోత్సవం' జరిగింది. వందమంది సాహితీ కవులు యువరచయితలు కలిసి ఒక వేదిక మీదకు వచ్చి అనర్గళంగా అమోఘంగా అనూహ్యంగా తమ కవితా ప్రవంతిని అందజేశారు. గర్వించదగ్గ కార్యక్రమంగా తెలుగుజాతి ఎంతోకాలం చెప్పుకోదగ్గ సంఘటనగా 'కవితోత్సవం' చిరస్థాయి సంపాదించుకుంది.

రెండవ రజతోత్సవ కార్యక్రమంగా 1986 సెప్టెంబరు 14వ తేదీన 'కథోత్సవం' జరిగింది. ప్రఖ్యాత కథా రచయిత శ్రీ వీరాజీ అధ్యక్షత వహించారు. ఎందరో పెద్ద కథా-నవలా రచయితలు ఈ కథోత్సవంలో 'మినీకథా పఠనం' చేశారు. తరువాత కథాసదస్సు తెలుగు కథ-తీరుతెన్నులు' మీద జరిగింది.

మూడవ కార్యక్రమం 'జానపద ఉత్సవం'గా 1986 అక్టోబరు 19వ తేదీన జరిగింది. కవిమిత్రులు జానపద గేయాలను చదివారు చివరలో 'జానపద సంగీత విభావరి' జరిగింది.

నాల్గవ కార్యక్రమం నవంబరులో ఆంధ్రప్రదేశ్ యువరచయితల మహాసభలు ఐదవ కార్యక్రమంగా డిసెంబరు 86లో నవలా సదస్సు జరిగినవి. ఇలా ఒక్కొక్క నెల ఒక్కొక్క కార్యక్రమం వేటికి సంబంధం లేదు. పోలికలేదు. పోటీలేదు. ఊరు ఒక్కటి. సంస్థ ఒక్కటి. అందరండ శ్రీ పోతుకూచి సాంబశివరావు. అదే రజతోత్సవ సంస్థ 'విశ్వసాహితి'కి చామంతిదండ.

# 12

విదేశాంధ్రులతో
శ్రీపోతుకూచి

మనరాష్ట్రములోనేగాక దేశవిదేశాలలో ఉన్న తెలుగు వారితోను, తెలుగు సాహితీ సభలతోను, సమావేశములతో శ్రీ సాంబశివరావుగారికి చక్కని సంబంధములున్నవి..

మారిషస్ ద్వీపంనుండి శ్రీ గున్నయబట్టు, నరసింహరామయ్య, నరసయ్య రాఘవుడు ప్రతినిధులుగా నాల్గవ అఖిల భారత రచయితల మహాసభలు 1968లో హైదరాబాదులో జరిగినపుడు విచ్చేసి సమావేశములలో పాల్గొని అక్కడి తెలుగువారి కష్టనిష్ఠూరాలగురించి చర్చించారు.

మారిషస్ దేశంలోని తెలుగు సాహితి ప్రియులను మన రాష్ట్రమునకు ఆహ్వానించడము, మన తెలుగువారిని ప్రభుత్వసహాయముతో అక్కడికి పంపడము జరిగింది.

అలాగే దక్షిణాఫ్రికా మిగతా విదేశాలలో ఉన్న తెలుగు వారిని ఒకే వేదికపై తీసుకొని రావడానికి వీరు చేయుచున్న కృషి అనిర్వచనీయము.

1970లో ఆంధ్ర విశ్వసాహితి దశమవార్షికోత్సవాలు రాష్ట్రపతి

శ్రీ వి. వి. గిరి ప్రారంభించినపుడు మారిషస్, ఫిజీదేశాల నుండి వచ్చిన విదేశీ తెలుగు విద్యార్థులు ప్రజలకు పరిచయం చేయబడినారు.

1971లో తెలుగురచయితల మహాసభల సందర్భంలో హైదరాబాదు వచ్చిన ప్రతినిధులకు మహాసభలలో మెమొంటోలు అందజేయడం జరిగింది. ఈ సందర్భంలో వచ్చిన విదేశీ తెలుగు విద్యార్థులకు శ్రీ పోతుకూచి ఆధ్వర్యంలో తగు విద్యావకాశాలు లభించేలా కృషిజరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల సహకారముతో విదేశీ తెలుగు విద్యార్థులకు కళాశాలలో ప్రవేశము ఏర్పాటు చేయడమే కాక ప్రత్యేక తెలుగు తరగతులు ఏర్పాటు చేయడానికి కూడా కృషి జరిగింది.

అఖిల భారత తెలుగు రచయితల మహాసభలవారు విదేశాలలోని తెలుగు వారికి అనేక గ్రంథాలు బహూకరించారు.

మారిషస్ దేశ విద్యామంత్రి శ్రీ వీరాస్వామి తెలుగు రచయితల మహాసభలతో సన్నిహితసంబంధాలు కల్పించుకున్నారు.

దక్షిణాఫ్రికా ఆంధ్ర మహాసభ వారు భారతదేశంలో తమ ప్రతినిధిగా శ్రీ పోతుకూచిని నియమించుకున్నారు.

మారిషస్ దేశంలో వెంకటేశ్వర ట్రస్ట్ కోశాధికారి శ్రీ N. రామయ్యతో సమావేశం (1984) జరిగింది. శ్రీ పోతుకూచి అధ్యక్షతలో భారత మారిషస్ దేశాలమైత్రి సంబంధాల గురించి చర్చించారు.

దక్షిణాఫ్రికాలోని దర్బాన్ ఆంధ్రమహాసభ ప్రతినిధులు శ్రీ A.J. నాయుడు శ్రీ P. M. నాయుడు విశ్వసాహితి సమావేశాలలో పాల్గొన్నారు.

మారిషస్ రచయిత శ్రీ ఆనంద్ ముల్లో శ్రీ పోతుకూచి ఆధ్వర్యంలో జరిగిన సమావేశాలలో పాల్గొన్నారు.

విదేశాంధ్రులతో మంచి సంబంధాలు పెంచుకొని, వారి సమస్యలకు అవసరాలకు ఎంతో సహాయసహకారములందించిన గొప్పస్నేహశీలి మన సాంబశివరావుగారు.

# 13

## ప్రపంచ తెలుగు మహాసభలకు ప్రాతిపదికలు

తెలుగుదేశంలో తెలుగు ప్రజల మధ్య ప్రపంచ తెలుగు మహాసభలు జరగడానికి పూర్వరంగమెంతో ఉంది. శ్రీ శ్రీ పోతుకూచి సాంబశివరావు కృషి ఎంతో ఉంది. నిర్విరామమైన కృషితో ఈ ప్రపంచ తెలుగు మహాసభలు జరిపి తెలుగు ప్రజలమధ్య సమైక్యత సమగ్రత తీసుకు రావాలన్న తపన శ్రీ సాంబశివరావులో ఉండబట్టే నిస్వార్థమైన వారి సేవలు ప్రపంచ తెలుగు మహాసభలకు ప్రాతిపదికలయినాయి.

1968లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు హైదరాబాదులో జరిపినపుడు 'ప్రపంచ తెలుగు మహాసభలు' జరపాలన్న తీర్మానం ఆమోదించారు. అంతేకాదు ఈ తీర్మాన ఫలితంగా తెలుగు రచయితల మహాసభల కార్యవర్గం ముఖ్యంగా ఇతర దేశాలలో మారిషస్,

మలేషియా, ఫిజీ, దక్షిణాఫ్రికాలలో నివసిస్తున్న తెలుగు వారితో సన్నిహిత సంబంధాలు పెంపొందించుకున్నాయి. ఈ దేశాలలోని ఆంధ్రమహాసభలు తెలుగు రచయితల మహాసభలకు అనుబంధమైనాయి. ఈ నాల్గవ సభలు జరిగినపుడు మారిషస్ దేశమునుండి ముగ్గురు ప్రతినిధులు శ్రీయుతులు N. రామయ్య, గున్నయ్యజట్టు, N.రాఘవుడు మహాసభలకు విచ్చేసినారు. తరువాత దక్షిణాఫ్రికా ఆంధ్రమహాసభ ఉపాధ్యక్షుడు శ్రీ A. J. నాయుడు, కోశాధికారి శ్రీ P. M. నాయుడు జంటనగరాలకు విచ్చేసి ఇక్కడ ముఖ్యమంత్రి తదితర మంత్రులను నగరంలోని పెద్దలను కలుసుకున్నారు.

1970లో అప్పటి విద్యాశాఖా మాత్యులు శ్రీ పి. వి నరసింహారావు తమ సెక్రటేరియట్ కార్యాలయంలో తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శి శ్రీ పోతుకూచి సాంబశివరావును సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ రామానుజరావును ఆహ్వానించి ప్రపంచ తెలుగు మహాసభల సాధ్యాసాధ్యాలను చర్చించి ముందుగా దేశవిదేశాలలోని తెలుగువారి వివరాలు సేకరించడం మంచిదని నిర్ణయించారు.

తరువాత 1971లో హైదరాబాదులో జరిగిన అయిదవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభలలో ప్రపంచ తెలుగు మహాసభలు 'త్వరలో' జరపాలని పలువురు ఉద్ఘాటించారు. అయిదవ తెలుగు రచయితల సభల ఆహ్వానసంఘ అధ్యక్షులు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తమ స్వాగతోపన్యాసంలో 'ప్రపంచంలో తెలుగువారందరూ సాంస్కృతిక ఐక్యత కలిగియుండాలనీ, ప్రపంచ తెలుగు మహాసభలు జరిపితే ఆ మహాసభలు విజయవంతంగా అందరికి సంతృప్తికరంగా జరపాలని అన్నారు.

తెలుగు రచయితల మహాసభల కార్యవర్గ అధ్యక్షులు శ్రీ దామోదరం సంజీవయ్య ప్రసంగిస్తూ ఈ కార్యభారాన్ని రచయితల మహాసభల కివ్వవచ్చుని, ఇదివరకే ఈ రంగంలో మహాసభలు కొంత ప్రాథమికమైన కృషిజరిపాయని అన్నారు. అయిదవ తెలుగు రచయితల సభలను ప్రారంభిస్తూ డాక్టరు సూరిభగవంతం ప్రపంచంలోని తెలుగు వారలను ఒకే వేదిక మీదకు రావలసిన ఆగత్యం వివరిస్తూ ప్రపంచ తెలుగుమహాసభలు జరపడం మంచిదని వివరించారు.

ఈ అయిదవ మహాసభల సందర్భంలో ఆమోదించబడిన తీర్మానాలలో ప్రపంచ తెలుగు మహాసభగూర్చి కూడా ఈ క్రింది తీర్మానము ఆమోదించబడింది.

'ఇతర దేశాలలో ముఖ్యంగా మారిషస్, దక్షిణాఫ్రికా, మలేషియా దేశాలలో ఉన్న ఆంధ్రమహాసభలు తెలుగు రచయితల మహాసభలకు అనుబంధం అవడంతో ఈ మహాసభలకు అంతర్జాతీయ స్థాయిలభించింది. అందువలన ఈ మహాసభలు ప్రపంచ తెలుగు మహాసభలు జరపడానికి శక్తివంతంగా ఉన్నాయి. మనరాష్ట్రప్రభుత్వం ప్రపంచ తెలుగుమహాసభల పథకం నిర్వహించునపుడు ఈ తెలుగు రచయితల సభలు సంపూర్ణ సహకారం అందివ్వగలవు. త్వరలో మనరాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలనీ తీర్మానించడమైనది.

తరువాత ఒకసారి శ్రీ పోతుకూచి, డా॥ సి. నారాయణ రెడ్డి, శ్రీ దేవులపల్లి రామానుజరావు విద్యామంత్రిని కలుసుకున్నప్పుడు సరియైన సమయంలో సరియైన వ్యక్తులకు ప్రపంచ తెలుగు మహాసభల పథకనిర్వహణ అప్పగింపబడగలదని చెప్పారు.

డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతలో సాహిత్య అకాదమీ జనరల్ కౌన్సిల్ సమావేశమైనపుడు ప్రపంచ తెలుగు మహాసభల ప్రస్తావన వచ్చింది. ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ విషయంలో ప్రభుత్వాన్ని కలుసుకునేందుకు ఒక ఉపసంఘం శ్రీయుతులు పోతుకూచి సాంబశివరావు, బోయిభీమన్న, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, అకాదమీ అధ్యక్ష కార్యదర్శులతో ఏర్పరచబడినది. తరువాత అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు, ఆంధ్రప్రదేష్ సాహిత్య అకాదమీల కార్యదర్శులు లేఖారూపంలో ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణలో తమ సహకారం అందిస్తూ రాష్ట్ర విద్యాశాఖకు తెలియజేశారు.

పైనచెప్పిన అంశాలదృష్ట్యా తెలుగురచయితల మహాసభలు జరిపిన ప్రాథమిక కృషి ప్రపంచ తెలుగు మహాసభలు 1975లో జరగడానికి చాల ఉపకరించింది. ఈ విషయంలో శ్రీ పోతుకూచి జరిపిన మహత్తర కృషి, నిస్వార్థసేవ సభలు విజయవంతం కావడానికి ఎంతగానో అవకాశం కల్పించింది. తెలుగుజాతి సాంస్కృతిక ఔన్నత్యానికి,యశోవైభవానికి దీటుగా పరిపుష్టమైన రీతిలో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించడం జరిగింది.

# 14

## విదేశాలలో శ్రీ పోతుకూచి

అఖిల భారత తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శి శ్రీ పోతుకూచి సాంబశివరావు రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక సహాయముతో 1968-69 లో మారిషస్, టాంజానియా, కీన్యా, ఈడెన్ మొదలయిన తూర్పు ఆఫ్రికా దేశాలలో సాంస్కృతిక పర్యటన చేశారు.

అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు 1968 లో హైదరాబాదులో జరిగినపుడు మారిషస్ నుండి ప్రతినిధులు వచ్చి పాల్గొన్నారు. ఆ మహాసభలలో ప్రపంచ తెలుగు మహాసభలు రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకొని ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదన వచ్చింది. దానికి ప్రాతిపదికగా శ్రీ సాంబశివరావు విదేశ పర్యటన చేయటం జరిగింది.

మారిషస్ దీవులలోని తెలుగు సోదరులతో ఆంధ్ర సాహిత్యంలో సన్నిహిత సంబంధం పెంచుకోవడానికీ, వారిలో ఆంధ్ర సాహిత్యంపై అభిరుచి అభిమానం కలిగించడానికి, ఆ దీవులలోని ప్రజలతో సాంస్కృతిక సంబంధాలను నెలకొల్పడానికి శ్రీ సాంబశివరావు మారిషస్ దీవులను సందర్శించారు.

ఆ సందర్భంలో మారిషస్ ప్రధానమంత్రి అయిన శ్రీ శివసాగర్ రామ్‌గులాం గారిని శ్రీ పోతుకూచి కలుసుకోవడం జరిగింది. వారితో

అక్కడి తెలుగు ప్రజలను గురించి, వారి ఇబ్బందుల గురించి, వారి సస్కృతి గురించి చర్చించడం జరిగింది. ఇది వీరి జీవితంలో విశిష్టమైన ంచారిత్రిక ఘట్టం. అందుకు శ్రీ పోతుకూచి బహుదా ప్రశంశనీయుడు.

భారతదేశంలో ఉండే తెలుగు వారికే కాకుండా మారిషస్‌మున్నగు ఇతర దేశాల నుండి కూడా తెలుగు వారిని రప్పించి వారికొక విశాలరంగ స్థలాన్ని ఏర్పరచిన మహావ్యక్తి మన సాంబశివరావుగారు.

ఏప్రిల్ 1981 లో ద్వితీయ ప్రపంచ మహాసభలు మలేషియాలో జరిగినపుడు మలేషియా, సింగపూర్ మరియు పెనాంగ్ సందర్శించారు.

తెలుగు భాష పట్ల తెలుగు ప్రజల పట్ల తెలుగు సంస్కృతి పట్ల విశేష గౌరవాభిమానాలు తమ మాటల్లో తమ పర్యటనల్లో విస్తృతంగా విదేశాల లోని తెలుగువారికి తెలియజేశారు సాంబశివరావు గారు. ఆ విధంగా ఆలోచిస్తేవారి సుహృద్భావ పర్యటనలు ఎంతో విజయవంతమైనట్లు భావించాలి.

# 15

## ఆంధ్రప్రదేశ్ యువరచయితల మహాసభలు

యువత కోసం శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు ఎన్నో ఎన్నో కొత్త కొత్త వేదికలను కల్పన చేశారు. మొదట సదస్సులుగా ప్రారంభమయి తరువాత ఆం.ప్ర. యువరచయితల మహాసభలుగా రూపు దిద్దుకున్నాయి. యువతలోని నవతను కాగడా పెట్టి

వెదికినట్లుగా, వారిలో నిబిడీకృతమైన స్పష్టమైన ఉత్తేజాన్ని వెలికితీసి సమాజానికి అద్దం పట్టినట్లుగా వెల్లడి చేశారు. ఇది ఒక అగని ప్రయత్నం వారు కన్న కలలు గానివ్వండి రూపకల్పనలు గానివ్వండి యువతకు వారు అందించిన ఒక మంచికార్యం ఈ యువరచయితల మహాసభలు.

విశ్వసాహితి ఆధ్వర్యంలో 1976 డిసెంబరు 14,15 తేదీలలో హైదరాబాదు వై.ఎం.సి.ఏ. లో యువరచయితల సదస్సులు నిర్వహింపబడ్డాయి. సదస్సులలో 'యువ రచయితలు-సమస్యలు' అనే అంశంపై జరిగిన గోష్ఠిలో అనేక మంది యువ రచయితలు పాల్గొన్నారు. నేటి సాహిత్యంలో మారుతున్న పోకడలను చర్చించారు.

గాంధీ జయంతి సందర్భంగా అక్టోబరు 2, 1981 న రాష్ట్రయువజన శాఖ సహకారంతో యువకవి సమ్మేళనం నిర్వహించారు. అప్పటి రాష్ట్రమంత్రి శ్రీ పి. జనార్ధనరెడ్డి ముఖ్యఅతిథిగా విచ్చేశారు.

కేవలం సదస్సులు కవి సమ్మేళనాలు గాకుండా రాష్ట్రం నలుమూలల నుండి విచ్చేసిన ప్రతినిధులతో ఆంధ్రప్రదేశ్ యువరచయితల మహాసభలకు మామిడి తోరణాలు కట్టారు మన సాంబశివరావు గారు. శుభకార్యంగా తీర్చిదిద్దారు. ప్రతి మహాసభకు అధ్యక్షులను ప్రతిష్ఠిస్తూ దుశ్శాలువలు కప్పారు, పూలమాలలు వేశారు.

ఆంధ్రప్రదేశ్ యువ రచయితల ద్వితీయ మహాసభలు 13, 14 ఆగస్టు 1 82 న జరిగాయి. సభలను అప్పటి రాష్ట్ర సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ బి. రామకృష్ణంరాజు గారు ప్రారంభించారు. శ్రీ సాంబశివరావుగారు రూపకల్పన చేసిన 'సాహిత్య ప్రశ్నావేదిక' కార్యక్రమంతో

ఆహూతులయిన యువ రచయితల ప్రశ్నలకు సభలకు విచ్చేసిన పెద్దలచే సమాధానాలను ఇప్పించారు. 'సాహిత్య వికాస వేదిక'గా తీర్చిదిద్దిన కార్య క్రమంలో సాహిత్యం గురించి యువరచయితలు క్షుణ్ణంగా చర్చించారు. శ్రీ రఘుశ్రీని మహాసభల అధ్యక్షులుగా ప్రతిష్ఠించారు.

రాష్ట్ర యువజనశాఖ సహకారంతో విశ్వసాహితి ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ తృతీయ యువరచయితల మహాసభలు అక్టోబరు 30, 31 నవంబరు 1, 1983 తేదీలలో జరిగాయి. సభలలో 'విద్యా విషయక కార్య గోష్ఠి' అంశంలో కవిత, కథ, నవల, నాటకం, విమర్శ, పత్రికా రచన వివిధ ప్రక్రియలపై వక్తలు ప్రసంగించిన పిదప ప్రతినిధులయిన యువ రచయితల ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చారు. తరువాత జరిగిన 'విమర్శ నాత్మక కార్యగోష్ఠి'లో ప్రతినిధులు సాహిత్యంలోని వివిధ అంశాలను తులనాత్మకంగా పరిశీలించారు. 'ఈ మహాసభలలో సరికొత్త అంశం 'ప్రయోగాత్మక కార్యగోష్ఠి' యువరచయితల ప్రశంశలను పెద్దల ఆశీ స్సులను పొందినది. కవితల కథల పోటీలలో ప్రతినిధులు అప్పటికప్పుడే పాల్గొన్నారు. ఉత్తమ రచనలకు నగదు బహుమతులను అందుకున్నారు. 'ఇన్‌స్టెంటు' రచనా విధానాన్ని యువతలో పెంపొందించడమే శ్రీ సాంబ శివరావు లక్ష్యం. అది ఎంతో దిగ్విజయంగా నెరవేరినది శ్రీమతి సీతా శరశ్చంద్రను మహాసభల అధ్యక్షురాలిగా ప్రతిష్ఠించారు.

నాల్గవ ఆంధ్రప్రదేశ్ యువరచయితల మహాసభలు 1984 డిసెంబరు 8వ తేదీన జరిగినవి. శ్రీ పోతుకూచి సాంబశివరావు తమ అధ్యక్షోపన్యా సంలో యువరచయితల మహాసభల లక్ష్యాలను వివరిస్తూ విశ్వసాహితి యువరచయితల కొరకు వివిధ సాహితి ప్రక్రియలలో శిక్షణా తరగతులు

చర్చాగోష్ఠులు, సదస్సులు నిర్వహిస్తున్నదని, గ్రంథాలు పత్రికలు ప్రత్యేక సంచికలు ప్రచురిస్తున్నదని చెప్పారు. మహాసభల అధ్యక్షునిగా యువ కవి శ్రీ జి. శ్రీశైలంను ప్రతిష్ఠించి సత్కరించారు.

మహాసభలలో 'నా మొదటి రచన అనుభవాలు' అంశంపై యువ రచయితలు తమ తమ అనుభవాలను ఆసక్తికరంగా వివరించారు. తరువాత జరిగిన 'ప్రశ్నా సదస్సు' రసవత్తరంగా సాగింది. వివిధ ప్రక్రియలపై యువరచయితలు ప్రశ్నలు వేసి పెద్దలనుంచి తమకు కావలసిన జవాబులను రాబట్టుకోవడం విశేషమనిపించింది.

విశ్వసాహితి ఆధ్వర్యంలో రాష్ట్ర యువజన శాఖ సహకారంతో అయిదవ ఆంధ్రప్రదేశ్ యువరచయితల సభలు అక్టోబరు 12, 13, 1985 తేదీలలో జరిగినవి. యువరచయితలు 'తమ రచనలు- అనుభవాల'ను తెలియజేశారు. ఈ మహాసభలలో ఏర్పాటుచేసిన 'సాహితీక్విజ్' శ్రీ పోతుకూచి సాంబశివరావు అమోఘమైన మేధస్సుకు కలికితురాయిగా భాసించి యువరచయితల ఆమోదం పొందింది. అంతేకాదు వారు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. క్విజ్‌లో పాల్గొని గెలుపొందిన 30 మంది యువరచయితలకు బహుమతులను అందజేయడం జరిగింది. తరువాత జరిగిన సాహిత్య సభలో ప్రతినిధులు వక్తలను ఎన్నో విధాలుగా వివిధ విషయాలపై ప్రశ్నించి సాహిత్యాభివృద్ధి విజ్ఞానం పెంచుకున్నారు. మహాసభల అధ్యక్షురాలిగా రాజోలు ప్రతినిధి శ్రీమతి వాడ్రేవు రమాదేవిని ప్రతిష్ఠించి సత్కరించారు.

ముగింపులో శ్రీ పోతుకూచి విశ్వసాహితి కార్యకలాపాలను ప్రస్తావిస్తూ యువరచయితల అభివృద్ధికి విశ్వసాహితి అందజేస్తున్న చేయూత

సహకారంను సవివరంగా వివరించారు. యువరచయితల సృజనాత్మక సాహిత్యాన్ని రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సహించాలన్నారు.

ప్రతి మహాసభలోను యువరచయితల 'కవిసమ్మేళనం' ఎంతో ఉన్నతంగా, ఎంతో గ్లామరస్‌గా, ఎంతో ఆకర్షణగా జరిగినవి. మహాసభల నిర్వహణలో శ్రీ పోతుకూచి పాత్ర ఎంతో ప్రశంసనీయమని ప్రతి ఒక్కరూ అభినందించారు.

మేరు గంభీరుడు శ్రీ పోతుకూచి సాంబశివరావు సాహిత్య రంగంలో సాంస్కృతిక రంగంలోను ఎన్నో కార్యక్రమాలను ఏర్పాటు చేస్తూ పెద్ద రచయితలను- యువరచయితలను ఒకే వేదిక మీదకు తీసుకు వస్తూ యువతలో నిబిడమై యున్న కొత్త వెలుగుల నవ్యసాహితిని ప్రకాశమానం చేస్తున్నారు. తాను కొవ్వొత్తిలా ఉండి, యువతకు వెలుగులు పంచి పెడుతున్నారు. అండదండలను అందజేస్తున్నారు.



**కార్యగోష్ఠుల ఏర్పాటులో శ్రీ పోతుకూచి**

రచనాసృష్టి విషయంలో రచయిత యొక్క సమస్యలు ఏమిటి మొదలయిన విషయాలన్నీ రచయితలందరూ ఒకచోట చేరి కూలంకషంగా చర్చించుకొని తగిన మార్గాన్ని అనుసరించడానికి అత్యుత్తమ రచనలకు దోహదం కలగడానికి సరియైన విమ

ర్శలు రావడానికి తెలుగు సాహిత్యపు విలువలు పెరగడానికి ఈ కార్య గోష్ఠులు (Work Shops) ఉపయోగపడతాయి. ఈ ధ్యేయంతోనే శ్రీ పోతుకూచి సాంబశివరావు ఈ కార్యగోష్ఠులను నెలకొల్పారు.

కార్యగోష్ఠులు నిర్వహించడంవల్ల విమర్శనాత్మకమైన పరిశీలనవల్ల ప్రతిసంవత్సరం వివిధ ప్రక్రియలపై మంచి విమర్శ వెలువడుతుంది. వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన కవులు రచయితలు విమర్శకులు సాహిత్యాభిమానులు పాఠకులు కలిసి చర్చించుకోవడంవల్ల ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలుసుకోవడం జరుగుతుంది. ఈ కార్యగోష్ఠులలో చర్చించిన విషయాలు, ప్రముఖుల ప్రసంగాలు, ఏర్చికూర్చి పుస్తకరూపంలో ప్రచురించడంవలన సాహిత్యానికి ఒక విలువ ఏర్పడి భావితరాల వారికి ఉపయోగపడుతుందనే ముఖ్యోద్దేశంతోనే విశ్వసాహితి ఈ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.

ఇది తెలుగులో ఒక కొత్త ప్రయోగం. ముఖ్యంగా యువరచయితలకు ప్రోత్సాహకరంగా ఉంటుందని శ్రీ సాంబశివరావుగారు ఈ కార్యగోష్ఠులను రూపొందించడం జరిగింది.

1975వ సంవత్సరంలో ప్రపంచ తెలుగు మహాసభలు దిగ్విజయంగా జరగడానికి అఖిలభారత తెలుగు రచయితల మహాసభలు ఎంతో సహకరించాయి. ఈ రచయితల మహాసభల్లో ఎన్నో సదస్సులు ఏర్పాటు చేసినప్పటికీ కొన్ని విషయాలను పూర్తిగా చర్చించుకునే అవకాశం రచయితలకు కలిగేదికాదు. అటువంటి అవకాశాన్ని రచయితలకు అందించి వారి సహకారంతో సమాజంలో ఉత్తమ రచనలు వచ్చేటట్లు చేయాలనే ఆశయంతోనే ఈ వర్క్‌షాపులను శ్రీ సాంబశివరావుగారు ప్రారంభించింది,

అఖిల భారత తెలుగు రచయితల మహాసభల్లో ప్రతిసారి ఏదో ఒక విషయంపై కార్యగోష్టిని ఏర్పాటుచేయడం జరిగింది. విషయ నిర్ణయంలో ఆమలులో ఎంతో చక్కని ప్రణాళిక శ్రీ పోతుకూచి ఉంచేవారు.

1977 జనవరి 8, 9 తేదీలలో శ్రీ పోతుకూచి సాంబశివ రావు విశ్వసాహితి, బాపట్ల కళాభారతి సంస్థల సంయుక్తాధ్వర్యంలో బాపట్లలో కార్యగోష్ఠని నిర్వహించారు. ఈ కార్యగోష్ఠిలో 1976 సంవత్సరంలోని కథలు, నవలలు, కవితలు నాటకాలు మొదలయిన అన్ని ప్రక్రియల పైన చర్చలు జరిగినవి. ప్రముఖ రచయితలు రచయిత్రులు పాల్గొని చర్చలను విజయవంతం చేశారు. శ్రీ కొర్రపాటి గంగాధరరావు ప్రభృతులు ఎంతో సహకార మందించారు. ఈ కార్యగోష్ఠిలోని ప్రసంగాలను, చర్చించిన విషయాలను ఏర్చికూర్చి పుస్తకరూపంలో ప్రచురించడం జరిగింది.

1977 అక్టోబరు 8, 9 తేదీలలో విశ్వసాహితి, నిజామాబాదు ఇందూరు భారతిల సంయుక్తాధ్వర్యంలో రాష్ట్ర స్థాయిలో కార్యగోష్ఠి జరిగింది. రెండు రోజులు జరిగిన ఈ కార్యగోష్ఠిలో 1) 1976 సంవత్సరంలో కవిత, 2) వచన కవితా రీతులు (అనువాదాలతో సహా) 3) సంప్రదాయ కవిత- దాని భవితవ్యం, 4) తెలుగు కవితలపై ఇతర భాషా కవిత్వాల ప్రభావం మొదలయిన అంశాలు చర్చకు వచ్చాయి. ఈ కార్యగోష్ఠిలో వివిధ ప్రాంతాలనుండి వచ్చిన కవులు, రచయితలు, విమర్శకులు, పాఠకులు గూడా పాల్గొన్నారు. వారు చేసిన ప్రసంగాలను అభిప్రాయాలను పుస్తకరూపంలో వెలువరించడం జరిగింది.

1979 లో కడపలో తెలుగు నాటకరంగం గురించి కార్యగోష్ఠి జరిపారు. ఈ కార్యగోష్ఠి నిర్వహణకు మునిసిపల్ కమిషనరు శ్రీ వేమ

రాజు నరసింహారావు ప్రభృతులు ఎంతో సహకరించారు. ప్రముఖ నటులు రచయితలు ఎందరో పాల్గొన్నారు.

1979 లో హైదరాబాదులో జరిగిన కథానిక-నవల కార్యగోష్ఠి ఎంతో విజయవంతమయింది. శ్రీ కాళోజీ నారాయణరావు ప్రత్యేక అతిథిగా వచ్చారు. దాదాపు 30 మంది ప్రముఖ కథ-నవలా రచయితలు పాల్గొన్నారు.

1984 లో హైదరాబాదులో జరిగిన తెలుగు నాటకం కార్యగోష్ఠి ఎంతో ఉపయోగకరమయింది. శ్రీ ఎస్.ఆర్. కృష్ణ మున్నగు ఎంతోమంది నటులు రచయితలు పాల్గొన్నారు. శ్రీ పోతుకూచి సాంబశివరావు ప్రసంగిస్తూ ఇటువంటి కార్యగోష్ఠుల ద్వారా నేటి పోకడలు సమీక్షించవచ్చునని నాటకరంగంలో రచయితలకు తగిన గౌరవం ఇంకా లభించకపోవడం విచారకర మన్నారు.

ఏ రచయిత అయినా అభివృద్ధిలోకి రావాలంటే అతని రచనలు విమర్శకుల దృష్టిలో ఉండాలి. అందుకే ఉత్తమ విమర్శలను అందచేస్తూ రచయితలకు ఒక ధ్యేయాన్ని ఏర్పదేటట్టు ఈ కార్యగోష్ఠులు చేయగలవని శ్రీ పోతుకూచి అన్నారు.

# 17

చర్చాగోష్టుల
ఏర్పాటులో
శ్రీ పోతుకూచి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ సహాయసహకారాలతో ప్రోత్సాహంతో ఆంధ్ర విశ్వసాహితి సంస్థ 1967 నుంచి చర్చాగోష్టుల పరంపరను ఏర్పాటు చేసింది. ఈ పథకం ఎంతో విజయవంతంగా కొన్ని సంవత్సరాల పాటు నడిచింది.

ఈ చర్చాగోష్టులకు పాఠకులను ఆహ్వానిస్తూ విశ్వసాహితి అధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావు, పాఠకులు, రచయితలు ఈ పథకం వలన ఈ చర్చాగోష్టుల వలన సాహిత్యంలోని ఉత్తమ నవలలను, ఉత్తమ రచనలను కూలంకషంగా చర్చించి వాటిలోని మంచి చెడ్డలను బేరీజు వేసి చూడవచ్చు నన్నారు. అందువలన ఈ పథకం బహుళ జనాదరణ పొందినదని చెప్పారు.

ఈ చర్చాగోష్టులలో ఎన్నో మంచి పుస్తకాలను నిశిత పరిశీలనం చేయడం జరిగింది. సాహితీ ప్రియుల అభిమానం పొందింది. 1. అడవి బాపిరాజు గారి 'నారాయణరావు', 2. రవీంద్రనాధ ఠాగూర్ గారి 'గీతాంజలి', 3. వేదం వేంకటరాయశాస్త్రి గారి 'ప్రతాప రుద్రీయం', 4. శ్రీశ్రీ గారి 'మహాప్రస్థానం', 5. గోపీచంద్ గారి 'మెరుపులు-మరకలు', 6. బుచ్చిబాబు గారి 'చివరకు మిగిలేది', 7. పురాణం, గొల్లపూడి,

కొమ్మూరి గార్ల గొలుసు నవల 'ఈడియట్', 8. నండూరి సుబ్బారావు గారి 'ఎంకి పాటలు', 9. విశ్వనాథ సత్యనారాయణ గారి 'కిన్నెరసాని పాటలు', 10. రాచకొండ విశ్వనాథశాస్త్రి గారి 'నిజం', 11. ముప్పాళ్ళ రంగనాయకమ్మ గారి 'బలిపీఠం', 12. 'చామంతులు' కథల సంకలనం, 13. ఆధునిక నాటికలు కొన్ని సేకరణలు, 14. బోయి భీమన్న గారి 'రాగ వైశాఖి', 15. శీలా వీర్రాజు గారి 'మైనా'. చర్చాగోష్ఠులకు ఎన్నిక చేసిన పుస్తకాలను పరిశీలిస్తే చాలు మన సాంబశివరావు గారి వైశిష్ట్యము బోధపడుతుంది. విషయం పట్ల పుస్తకాల ఎన్నికపట్ల వారి సమగ్ర అవగాహన ఆలోచన అర్థమవుతుంది.

1981 లో విశ్వసాహితి ఆధ్వర్యంలో 'జ్ఞానమూర్తి కథలు' గ్రంథంపై చర్చ జరిగింది. శ్రీ పోతుకూచి సాంబశివరావు అధ్యక్షత వహిస్తూ జ్ఞానమూర్తి కథలలో ఆధ్యాత్మిక జిజ్ఞాస ఉందనీ సమాజాన్ని ఆధారంగా తీసుకొని ఇటువంటి కథలు వ్రాయడం కొత్త పద్ధతి అని అన్నారు. చివరలో జ్ఞానమూర్తి సమాధానం ఇచ్చారు.

1981 లో రాజమహేంద్రవరం గౌతమీ గ్రంథాలయంలో విశ్వసాహితి ఆధ్వర్యంలో శ్రీమతి వసుంధరా దేవి రచించిన 'గాలిరథం కదిలింది' అనే గ్రంథంపై చర్చాగోష్ఠి జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ పోతుకూచి సాంబశివరావు ఈ చర్చాగోష్ఠులు జంటనగరాల లోనేకాక ఇతర చోట్ల గూడా నిర్వహిస్తున్నామని అందువల్ల మంచి ఫలితాలు కనిపిస్తున్నా యన్నారు. గాలిరథం కథలలో ప్రత్యేకత ఉన్నదన్నారు. కథలో ఇతివృత్తంలోనే కాక శిల్పంలో గూడా ప్రత్యేకత ఉందన్నారు. చివరలో కథా రచయిత్రి చర్చాగోష్ఠికి సమాధానం ఇచ్చారు.

1985 సెప్టెంబరు నెలలో శ్రీ చంద్రమౌళి రచించిన 'ఉల్క' నవల గురించి చర్చాగోష్ఠి జరిగింది. నవల గురించి శ్రీ పోతుకూచి శ్రీ వేమరాజు నరసింహారావు మున్నగు వారు ప్రసంగించారు. చంద్రమౌళి సమాధానం చెప్పారు.

కథలు వ్రాయడం నవలలు వ్రాయడం అదే స్పీడులో పాఠకులు చదివి అవతల పడేయడం అంతా కమర్షియలైజ్ అవుతున్న ఈ రోజుల్లో శ్రీ సాంబశివరావు గారు పాఠకుల రచయితల మధ్య వారధిగా చర్చాగోష్ఠులను ఏర్పాటు చేయడం సమాజంలో ఇంకా అక్కడక్కడా ఉన్నత విలువల పట్ల గౌరవ భావం ఉన్నదన్న తృప్తి కలుగుతున్నది.

ఈ చర్చాగోష్ఠుల వలన ఉత్తమ రచనలు రావడానికి అవి నాలుగు కాలాల పాటు ఉండగలవని శ్రీ సాంబశివరావుగారి ఉద్దేశ్యం.

# 13

## సాహితీ విద్యాలయ శిక్షణా తరగతులు

శ్రీ పోతుకూచి సాంబశివ రావు తన అమోఘమైన మేధా సంపత్తినుంచి తీసుకువచ్చిన కొత్త విషయము 'సాహితీ విద్యాలయ' కార్యక్రమము. ఈ సాహితీ విద్యాలయ ద్వారా యువతకు కథ, కవిత, నవల, నాటకము లందు ప్రత్యేకమైన పద్ధతిలో ప్రత్యేకమైన సిలబసుతో శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటుచేయడం దేశంలోనే

ప్రప్రథమం. ఒక వినూత్నం. పెద్దలను పిలిచి ఉపన్యాసాలు ఇప్పించడం పోటీలు పెట్టడం బహుమతులనివ్వడం గూడా శిక్షణాకార్యక్రమాలలో భాగం చేశారు.

ఏ విషయంలోనైనా కొత్త ప్రయోగాలు చేయడం శ్రీ సాంబశివ రావుకు ఇష్టం. తెలుగులో మొట్టమొదటిసారిగ 'సాహితీ విద్యాలయ' ఏర్పరచి ఆయన మాటల్లో Budding Writersకు సాహిత్య ప్రక్రియల్లో తర్ఫీదుఇచ్చే ఏర్పాటు చేశారు. స్కూళ్ళుపెట్టి రచయితలనుతయారు చేయలేరన్న ఛాందసులుసైతం కొద్దోగొప్పో మారక తప్పలేదు.

తరువాత తరువాత ఈ శిక్షణా తరగతులలో జర్నలిజం, జ్యోతిషం మున్నగు వాటిని గూడా చేర్చారు. అంతేకాదు ఈ సంస్థద్వారా జిల్లాల లోని యువరచయితలకు పోస్టుద్వారా కూడా శిక్షణ ప్రారంభించారు. రెండు మూడు నెలల కోర్సుగా ఈ సాహితీ విద్యాలయ కార్యక్రమము యువతలో ఎంతో ఆసక్తిని కలిగించింది. ఈ కృషిలో హైదరాబాదు Y.M.C.A ఎంతో సహకరించింది. ప్రస్తుతం సంస్థస్వంత భవనంలోనే నడుస్తున్నవి.

సాహితీ విద్యాలయలో శిక్షణ పూర్తిచేసుకున్న యువతకు విశ్వ సాహితి సమావేశాలలో అర్హతా పత్రాలు అందజేయడం జరుగుతున్నది. డైరెక్టరుగా శ్రీ పోతుకూచి సాంబశివరావు ఈ శిక్షణా తరగతులను తమ చక్కని ప్రణాళికతో నిర్వహిస్తున్నారు.

ఒకసారి (1972) నాటకం విషయంపై సాహితీ విద్యాలయ నిర్వహించిన కోర్సులో శిక్షణపొందిన యువత 'రచయితా నీ పాత్రలు నిన్నే వెక్కిరిస్తున్నాయి', 'మిత్రద్వయం' అను రెండు నాటికలు, ముగింపు సభ

నాడు 'ఊహావాస్తవం', 'ఆడంబరాలు-రిహార్సల్సు' నాటికలను ప్రదర్శించారు. అలాగే కథ కవిత విషయాలలో శిక్షణ పొందిన యువత వ్రాసిన మెరుగైన సాహిత్యం విశ్వరచనలో ప్రచురించడము జరుగుతున్నది.

ఒక విషయాన్ని చూచి దాన్ని ప్రాక్టికల్‌గా ఆలోచించి అది మన పరిస్థితులకు అన్వయించి దాని ఆచరణలో పెట్టే కార్యశీలి మన సాంబశివరావుగారు. దీనికి ఉదాహరణ 'సాహితీ విద్యాలయ'.

## అకాడమీలతో శ్రీ పోతుకూచి

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు కవులకు కళాకారులకు ఎన్నో విధాలుగా సేవచేశారు. స్వయంగా తానే కాకుండా, తాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అకాడమీలలో సభ్యులై సాహిత్య సాంస్కృతిక రంగాలలో ఎంతో సహాయం చేశారు

కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహాసంఘంలో గౌరవసభ్యులుగా చేశారు. UNILIT ద్వారా భారతీయ సమైక్యతకు సమగ్రతకు వారు చేసిన సేవలను ఎందరో ప్రస్తుతించారు.

1979లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి జరిగిన జనరల్ కౌన్సిల్ ఎన్నికలలో పోటీచేసి ఎన్నికయినారు. సాహిత్య అకాడమీ సహాయసహకారాలతో విమర్శనా ధోరణిలో సాహిత్య కార్యగోష్ఠులను

వివిధ ప్రాంతాలలో నిర్వహించారు. ఎంతోమంది యువతీయువకులు ఈ కార్యగోష్ఠులపట్ల ఆకర్షితులై ఎంతో నేర్చుకున్నారు. సాహిత్య అకాడమీ తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమయేవరకు ఎంతో బాధ్యతాయుతంగా ప్రముఖంగా సేవచేశారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీలో సభ్యులుగా ఉంటూ అకాడమీ మాసపత్రిక 'నాట్యకళ'కు సహాయ సంపాదకులుగా పనిచేసి విజ్ఞులైన పాఠకుల మన్ననలను అందుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీలో సభ్యులుగా పనిచేసి పేరు ప్రఖ్యాతులు సంతరించుకున్నారు.

ఆకాశవాణి సలహాసంఘ సభ్యులుగాపనిచేసి విజ్ఞులు-శ్రోతల అభి నందనలు అందుకున్నారు.

కొంతకాలం ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనెట్ సభ్యులుగా పనిచేశారు.

ఎక్కడ ఏ పదవిలో ఉన్నా ప్రజలకు కళలకు దగ్గరగా ఉంటూ వారిని ప్రోత్సాహపరుస్తూ వారిలో ఒకరుగా కలసిపోతారు వారిలోని అభి నివేశానికి మెరుగులు దిద్దుతారు. అదే శ్రీ సాంబశివరావుగారి ప్రత్యేకత.

# 20

## సాహితీ రజతోత్సవం జరుపుకున్న శ్రీ పోతుకూచి

ప్రాథమిక సమావేశాలు జరిపి,పూర్వ రంగాన్ని సిద్ధం చేసుకొని మిత్రులందరు కలసి శ్రీ పోతుకూచి సాంబశివరావుకు సాహితీ రజతోత్సవ అభినందన సభ జరిపారు. అభినందన సంచిక ప్రచురించారు. సాంబశివరావు గారి పట్ల ప్రేమతో అభిమానంతో స్నేహంతో మెప్పుతో ఎందరో సహకరించారు.

అదొక వెల్లువ. ఆ రోజు మార్చి 29, 1974. హైదరాబాదు తిలక్ రోడ్డు లోని ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో ప్రముఖ రచయిత, సాహితీ వేత్త, బహు సారస్వత సంస్థల వ్యవస్థాపకుడు అయిన శ్రీ పోతుకూచి సాంబశివరావు సాహితీ రజతోత్సవం జరిగింది.

అశేష జన సందోహం నడి మధ్యలో అమృత వర్షపూరితమైన చిరునవ్వుల మధ్యలో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు గారి అధ్యక్షతన వైభవోపేతంగా భావస్ఫోరకంగా జగజ్జేగీయమానంగా జరిగినది. ఈ సాహితీ రజతోత్సవాలను ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రారంభించారు.

సాహితీ రజతోత్సవ సంఘ అధ్యక్షులు శ్రీ ఎ. చక్రపాణి ఆహూతు లకు స్వాగతం పలుకుతూ శ్రీ పోతుకూచి సాంబశివరావు ఇరవై అయిదు సంవత్సరాలుగా పలు సాహితీ ప్రక్రియలలో సవ్యసాచి వలె కృషి సలిపా రనీ, వారి సారస్వత సేవ అత్యంత గణనీయమని ఆయనకు జరిపే సాహితీ రజతోత్సవ సన్మానం యావదాంధ్ర జాతికే గర్వకారణమని పేర్కొన్నారు.

సాహితీ రజతోత్సవ సంఘ కార్యదర్శి శ్రీ మర్ల అప్పారావు తమ నివేదికలో శ్రీ సాంబశివరావు గావించిన సాహితీసేవకు అతని మిత్రులు అభిమానులు ఈ రజతోత్సవాలను తలపెట్టారని, రచయితగా నిర్వాహక దక్షుడుగా శ్రీ సాంబశివరావు ఖ్యాతి భారత హద్దులను అధిగమించి ఖండాంతరాలకు వ్యాపించిన దన్నారు.

ఆంధ్రప్రదేశ్ విద్యా శాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణా రావు తమ ప్రారంభోపన్యాసంలో శ్రీ సాంబశివరావు గారు రచనా వ్యాసా గంలో సిద్ధహస్తులని ఆయన పలు నవలలను, నాటికలను తెలుగు ప్రజలు విశేషంగా ఆదరించారని ఆయనకు జరిగే సాహితీ రజతోత్సవం అత్యంత సముచితమని పేర్కొన్నారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావుకు 'సాహితీ చైతన్య' బిరుదు ప్రదానం చేశారు.

శ్రీ కోతా రాఘవరావు సన్మానపత్రం సమర్పించారు.

అనేక సంస్థల ప్రతినిధులు శ్రీ పోతుకూచికి పూలమాలలు, పట్టు శాలువలు సమర్పించారు. సాహితీ రజతోత్సవ సంఘం వారు శ్రీ పోతు కూచికి రు. 1116/- లు సమర్పించారు.

ఈ సందర్భంగా విడుదల చేయబడిన రజతోత్సవ సంచిక 'రజతాంజలి'ని శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య ఆవిష్కరించారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు తమకు శ్రీ సాంబశివరావుకు గల అనేక సంవత్సరాల సాన్నిహిత్యాన్ని వివరిస్తూ ఆయన వ్యక్తి కాదు వ్యవస్థ అని పేర్కొంటూ శ్రీ సాంబశివరావు స్నేహశీలత వారి ప్రవర్తన అత్యంత గణనీయమని పేర్కొన్నారు. వివిధ సంస్థలను సమర్థతతో నిర్వహించడమే కాక యువ రచయితలకు మార్గదర్శకం కాగల సాహితీ విద్యాలయ స్థాపించి పేరు పొందారని వివరించారు. వివిధ దేశాలు పర్యటించి శ్రీ సాంబశివరావు తెలుగు ప్రజల సుహృద్భావాలను శుభాకాంక్షలను ఖండ ఖండాంతరాలకు వ్యాపింపజేశారని శ్లాఘించారు.

కళాప్రపూర్ణ పద్మశ్రీ బోయి భీమన్న మాట్లాడుతూ శ్రీ పోతుకూచి అత్యంత పిన్నవయసులోనే అందరికీ అభిమానపాత్రమైన రచయిత అయినారనీ ఆయన రచనలు విశాల దృక్పథానికి ప్రాతిపదికలైనాయనీ పేర్కొన్నారు.

ఆచార్య డా॥ దివాకర్ల వెంకటావధాని గారు తమ ఉపన్యాసంలో శ్రీ పోతుకూచి వ్రాసిన నవలలను విశ్లేషిస్తూ వారి రచనలు పాఠకులను తేజపరచి 'ఉసాంతం హృదయాన్ని అకట్టుకుంటాయనీ తెలియజేశారు.

సభాధ్యక్షులు శ్రీ ఆవుల సాంబశివరావు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ పోతుకూచి ఉత్తమ లక్షణ సమన్వితులనీ ఆయన రచనల లోని భావ

కవిత అత్యంత రమణీయమని అటు ఉత్తమ రచనలు అందజేస్తూ యిటు సాహితీ సంస్థ లెన్నింటినో నిర్వహిస్తున్న శ్రీ సాంబశివరావు కార్యదక్షు అని అభినందించారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావు తనకు జరిగిన సాహితీ రజతోత్సవ సన్మానానికి కృతజ్ఞతలు తెలియజేస్తూ విద్యార్థిదశలో ఉండగానే తనకు భావావేశం కలిగి కవితా వ్యాసాంగం మొదలయిందనీ, ఆనాటి నుంచే నవలలు కథలు నాటికలు రచించి తెలుగు సరస్వతికి యథోచిత సేవ గావించాననీ వివరించారు. సాహితీరంగం ఆధారంగా విశ్వశ్రేయస్సు సాధించడం సాధ్యమని ఆదే తన గాఢ నమ్మకమనీ, అఖిల భారత తెలుగు రచయితల సభల ద్వారా, అందరినీ సంఘటిత పరచడం, విశ్వ రచన, యూనిలిట్ పత్రికల ద్వారా తెలుగు సంస్కృతి విశ్వవ్యాప్తం కావడానికి కృషి చేయడం తన ధ్యేయమని పేర్కొంటూ తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు వ్యక్తం చేశారు.

సభా కార్యక్రమానంతరం శ్రీ ఎం. నాగేశ్వరరావు బృందంచే శ్రీ పోతుకూచి విరచితమైన 'దొంగ' అను నాటిక ప్రదర్శింపబడింది.

శ్రీ పోతుకూచి సాహితీ రజతోత్సవం మరెన్నిటికో శ్రీకారం చుట్టి వ్యక్తిలోని శక్తిని పసిగట్టి ఆ శక్తికి ఒక అవకాశం కల్పించి తానొక్కరైనా పెక్కు మందిని సంఘటిత శక్తిగా మలచి ఒక సాహిత్య ఉద్యమాన్ని సృష్టించగల వారి వ్యక్తిత్వానికి ఈ సాహితీ రజతోత్సవం ఒక క్రొత్త మలుపులా భాసించింది. ఎనలేని ఆత్మవిశ్వాసం, అద్వితీయమైన కార్యదక్షత, పదిమంది చేత పని చేయించగల నేర్పు, అవసరానుగుణమైన పథక రచన, అలసట నెరుగని ఉత్సాహం గల మన పోతుకూచి సాంబ

శివరావు గారికి ఈ సాహితీ రజతోత్సవం ఎంతో సముచితమైనది. వారి ఉజ్వల భవిష్యత్తుకు బంగారు సోపానంగా భాసించింది.



## సన్మానాల మధ్య శ్రీ పోతుకూచి

అజరామరమైన కీర్తిగడించి యువ రచయితలకు ఆప్తుడిగా పెద్దలకు ప్రమాణంగా స్నేహశీలిగా దిద్దుకున్న మన పోతుకూచి సాంబశివ రావుగారు తమ సుదీర్ఘ సాహిత్య జీవితంలో ఎన్నో సన్మానాలు సత్కారాలు పొందారు. దుశ్శాలువలు అందుకున్నారు. నిలువెత్తు పూలమాల లందుకున్నారు. ఆశీస్సులందుకున్నారు. ఆనందం పంచుకున్నారు. ప్రేమను అభిమానంను సంపాయించుకున్నారు. సన్మాన పరంపరలలో శ్రీ పోతుకూచిని చూస్తున్న తెలుగుజాతి గర్వించిన రోజులెన్నో. కథలుగా చెప్పుకున్నరోజులెన్నో.

1981లో హైదరాబాదు 'స్వరసుధ' తమ ఐదవ కార్యక్రమంగా శ్రీ పోతుకూచి సాంబశివరావు సన్మానం చేశారు. సన్మానసభలో ముఖ్య అతిధిగా విచ్చేసిన హైకోర్టు న్యాయమూర్తి శ్రీ కె. పున్నయ్యగారు మాట్లాడుతూ శ్రీ పోతుకూచికి వివిధ రంగాలలో ప్రతిభా వైవిధ్యమున్నదని ప్రజాజీవితంలో పనిచేసే వారికి అటువంటి ప్రతిభ అరుదని అన్నారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీదాశరధి తన ప్రసంగంలో శ్రీ పోతుకూచి

నిర్వహించే వివిధ సాంస్కృతిక కార్యక్రమాల గురించి వివరిస్తూ దీక్షా పట్టుదల నిజాయితీ లేనిదే ఇన్ని కార్యక్రమాలు చేయడం కష్టమన్నారు.

శ్రీ త్రిపురాన రాఘవదాసు శ్రీ పోతుకూచిని సన్మానిస్తూ శ్రీ పోతుకూచి చేసిన త్యాగం, సేవ సర్వజన విదితం అన్నారు. ప్రఖ్యాత సినీ సంగీత దర్శకులు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు శ్రీ పోతుకూచి చేసిన సాహిత్య సేవను ప్రశంసిస్తూ డా॥ సుంకుబలరాం ఇచ్చిన మెమొంటోను అందజేశారు.

సన్మానపత్రం చదివారు. సన్నాయివాద్యం ప్రయోగించారు.

ఇంకా ఎన్నో సంస్థలు 1970లో ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం (తెలంగాణ మండలం) నాటకోత్సవాల సందర్భంలో జనగాంలో సన్మానించారు. 1973లో హైదరాబాదు సంజీవరెడ్డినగర్ 'నవ్య కళాసాగర్' వారు సన్మానించారు. హైదరాబాదు ఉదయ కళావిహార్ వారు తమవార్షికోత్సవసందర్భంగా సన్మానించి సత్కరించారు. విశాఖపట్నంలోని గ్రంథాలయ సంస్థవారు 1981లో శ్రీ పోతుకూచిని సన్మానించారు. గుంటూరు లయన్స్‌క్లబ్ వారు శ్రీ పోతుకూచిని సన్మానించిన సభలో శ్రీ పోతుకూచి జర్నలిజానికి సాహిత్యానికి చేసిన సేవలను ప్రస్తుతించారు. 1986 లో హైదరాబాదు సాధన సాహితి స్రవంతి వారు శ్రీ పోతుకూచికి ఎవార్డు వచ్చిన సందర్భంలో సన్మానించి సత్కరించారు.

అఖిల భారత రచయితల సంస్థ ఇండియన్ రైటర్స్ యూనియన్ కార్యవర్గానికి కార్యదర్శిగా ఎన్నిక అయిన సందర్భంలో, సెన్సారు బోర్డు సభ్యుడిగా నియమించినప్పుడు హైదరాబాదు లోని వివిధసంస్థలు శోభాయమానంగా ఆయనను సమ్మానించినాయి.

సన్మానాలు సంకెళ్ళు కాక సన్నని తొలకరి చినుకులుగా, పచ్చని అక్షింతలుగా, తెల్లని మంచు సోనలుగా శ్రీ సాంబశివరావును అభిషేకించి నాయి.

# 22

## ఎవార్డుతో శ్రీ పోతుకూచి

ఒక మనిషికి గుర్తింపు ఎప్పుడు వస్తుందో తెలియదు. కాని గుర్తింపు వచ్చిన తరువాత వారి విశ్వరూపం అపూర్వమై ప్రశంసాపాత్ర మవుతుంది. అనిర్వచనీయమవుతుంది. అంతేకాదు ఒక గొప్ప అదృష్టమవుతుంది.

ఇటీవల (1986) కన్యాకుమారిలో జరిగిన ఇండియన్ రైటర్సు కాన్ఫరెన్సు సభలలో ప్రముఖ రచయిత శ్రీ పోతుకూచి సాంబశివరావుకు 'భారతీయ లేఖక్ నికాయ్' ఎవార్డు బహూకరించారు. భారత దేశంలో ఈ ఎవార్డు స్వీకరించిన ఎనమండుగురు ప్రముఖ రచయితలలో శ్రీపోతుకూచి ఒకరు. ఈ అవార్డు అఖిల భారత జాతీయ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ జి. కె. మూపనార్ సంస్థ పక్షాన బహూకరించారు. ఎవార్డుతోబాటు తామ్రఫలకం, వేయిరూపాయల నగదు అందజేశారు. సమావేశంలో భారత దేశంలోని రచయితల పాత్రగురించి చర్చజరిగింది. భారతదేశంలో శాంతి సమగ్రతలకు రచయితలు కృషి చేయాలని సభలలో తీర్మానించడమైనది.

ఎవార్డు పొందిన సందర్భంలో జంటనగరాల వివిధ సంస్థలు శ్రీ పోతుకూచిని ఘనంగా గర్వంగా సన్మానించాయి. అభిమానించిన ప్రజల మనసులకు మరింతదగ్గరయినారు. నిజం ఎవార్డుకన్న మన పోతుకూచి మిన్న.

# 23

కథారచయితగా
శ్రీ పోతుకూచి

తెలుగు కథాజగత్తులో మన పోతుకూచి సాంబశివరావుగారు ఒక విశిష్ట స్థానం సంపాదించుకున్నారు. వందల కథలు రచించి కథాసాహిత్యంలో గణనీయమైన కృషి సలిపిన పోతుకూచి సాంబశివరావుగారి కలం నుంచి కలలనుంచి సమాజంలోని వివిధ దృక్కోణాల రేజర్ కిరణాలు వెలువడ్డాయి.

కథారచయితగా అనేక ప్రయోగాలు చేశారు. పరిమిత వాతావరణంలో అంతర్గత భావాల ఆధారంగా పాత్రలు సన్నివేశాలు సృష్టించి కథలు వ్రాశారు. వీటికి పాఠకలోకం ఆదరణ మన్నన విశేషంగా లభించినవని విశ్వసనీయమైన విషయం. పాత్రలు సజీవంగా మలచి వాస్తవికతను సన్నిహితంగా రూపొందించడంలో మేధావి ఆయన. ఒకసారి ఆయన వ్రాసిన కథ చదివాక ఆ కల్పన ఆ సన్నివేశాలు ఏవో, జీవి

తంలో ప్రతివారికీ జరిగిన గతంలోని సంఘటనలు గుర్తుకువస్తాయంటే అతిశయోక్తికాదు.

వారు వ్రాసిన వందల కథలు ఎన్నో సంపుటాలుగా వచ్చాయి. సంచలనం సృష్టించాయి. ఎదురు ప్రశ్నలు (1952), హైదరాబాదులో (1957), బ్రతుకులపతనం (1962), కొత్త విలువల బ్రతుకు (1963), శేఖరం కథలు (1964), మందారాలు (1969), సాంబశివ రావు కథలు (1978), స్వగతాలు-గల్పికలు (1980). ఒక్కొక్క సంపుటి కొత్తదనంతో మరింత మెరుగులతో ఉర్రూత లూగిస్తాయి. ఉత్సాహపరుస్తాయి.

"కొత్తవిలువల బ్రతుకు" కథాసంపుటి ఎన్నో మంచికథలకు అద్దం పట్టింది. "కొత్త విలువల బ్రతుకు" చాలా రోజులు జ్ఞాపకం ఉండే కథ. కనీసం ఒక కుటుంబం బాగుపడితే ఒకడు నశించినా ఫరవాలేదు ఇలా ఎన్నో మంచి విలువలకు ప్రాణం పోసింది. రాజా పాత్ర చిరస్మరణీయమైనది. "మామ్మ నడిపిన విప్లవం"లో శేషమ్మ మామ్మ సరికొత్తగా విప్లవం నడిపి లలితకు వివాహం చేసింది. విధవా వివాహం జరపడమే ఆమె గొప్పతనం, తను అనుభవించిన బాధను తరువాత తరం అనుభవించ గూడదన్న ఆలోచనే ఈ విప్లవానికి నాంది. మామ్మ, లలిత, రాజారావులు తిరుగుబాటుదారులే. ఈ కథలో రచయిత పూర్వపు తరానికి ప్రతినిధి అయిన "మామ్మ" చేతనే విప్లవం నడిపించి సనాతన సంప్రదాయాల మీద దాడి చేయించడం విశేషం. వ్యాపార జీవితానికి అభ్యుదయం కూర్చే విశ్వాసమైన కార్మికులే ఫ్యాక్టరీలకు నిజమైన వారసులని చక్కని కథ 'వారసులు' లో చెప్పారు కార్మిక జన పక్షపాతి మన రావు

గారు నిర్మొహమాటంగా నిష్కర్షగా. చక్కని సంసారపక్షమైన కథ 'మాతృమూర్తి' లో హస్త సాముద్రికం తెలియకుండా పెద్ద పాత్ర నిర్వహించింది. చాలా చిత్రమైన పాత్రతో తల్లిగాచల్లగా చూచిన మాతృమూర్తి మరపురాని కథ ఇది. భార్యాభర్తల మధ్య అభిప్రాయ భేదాలు వచ్చి కొన్ని రోజులు విడిపోవడం పిల్లలు రాయబారం చేసి కలపడం 'రాయబారి' కథలో ఎంతో చక్కగా చిత్రించారు. ఈ కథ వారి జీవితంలోని కొన్ని సంఘటనలతో ముడిపడి ఉందని చెప్పవచ్చు.

అజరామరమైన ప్రేమకు 'శేఖరం కథలు' స్వాగతం పలికాయి. అతను శేఖరం. ఆమె డాక్టరు. బ్రతుకులో వేదన ఉన్నంత కాలం చెబుతానంటాడు ఆమె గురించి. ఆమెగురించి ఆలోచిస్తాడు. తపిస్తాడు శేఖరం. ఆమె పలకరిస్తుంది. బిగింపుగా నవ్వుతుంది. అవసరమైన చోట మందు ఇస్తుంది. ఇంటికి పిలుస్తుంది. ఫలహారం పెడుతుంది. కాబోయే భర్తను చూపిస్తుంది. శేఖరం ఆమె కోసం వెదుకుతాడు. కలుస్తాడు. ముక్తసరిగా మాట్లాడుతాడు. ఉత్క్రోష పడతాడు. చివరకు టైఫాయిడ్‌తో మరణిస్తాడు. కానీ సాంబశివరావు గారి కథల్లో చిరంజీవిగా నిలుస్తాడు. ఒకవైపు ఆశ ఒక ఆనందం ఒక్కసారిగా కొండపై నుంచి గుండెపై నుంచి త్రోసినట్లుగా రూపొందిన చక్కని కథల సంపుటి.

మంచి కథల 'మందారాలు' ఎర్రదనంతో ఎంతో ఆహ్లాదం కలిగిస్తాయి. చైనా దురాక్రమణ సమయంలో దేశభక్తికి సంసార జీవితాన్ని కలగలిపిన ఎంతో చక్కని కథలు "అతనిలో వెలుగుచుక్క" "తొలి వెలుగు మలుపు", చాలాకాలం గుర్తుండే కథ "మలుపు తిరిగిన మమత" పెళ్ళి విషయంలో చివరకు శ్యామల తీసుకున్న నిర్ణయం ఎంతో బాగు

న్నది. జైలునుంచి విడుదలయిన రంగన్న వరదలలో పెళ్ళాం బిడ్డలను పోగొట్టుకొని చివరకు మిలటరీలో చేరిపోతాడు. 'విముక్తి' కథ చక్కని కథ. "అసమర్థుడు-సమర్థుడు" కథలో జీవితంలో లోకంలో బ్రతకనేర్చిన వాళ్ళను చూసి అసూయపడడు "అసమర్థుడు" చంద్రశేఖరం. మామూలు జీవితం ఇచ్చిన తృప్తి మరో విధంగా రాదని తెలుసుకుంటాడు. మంచికథ. నీతినిజాయితీ గల ఆఫీసరు ఎంతటి విపత్తు వచ్చినా తట్టుకొని ఎదుర్కొన్న కష్టాలను అతి తేలికగా సహజంగా విప్పి చెప్పగలడని నిరూపించాడు రామచంద్రరావు "రామచంద్రుని అరణ్యవాసం" కథలో 'హేట్సాఫ్ టు రామచంద్రరావు' చక్కని శైలీ చక్కని కథనం గల మంచికథ. ఇలా ఎన్నో కథలు, ఎన్నో సంపుటాలు.

శ్రీ సాంబశివరావు కథల్లో ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబాలలోని ఈతిబాధలు, సాదక బాధకాలు ఎక్కువగా ప్రతిబింబిస్తాయి. మృదువైన భాషలో తేలికగా చక్కని సన్నివేశాలను సృష్టించగలరు.

మన సాంబశివరావుగారు సంభాషణలు నడిపేతీరులో చూపేనేర్పు, పాత్రచిత్రణలోను శిల్పంలోను అంతగా చూపించినట్లు తోచదు. చెప్పక పోయినా వీరిలో కొంత 'చలం'ప్రభావం పనిచేస్తున్నట్లు ఉంటుంది. రచయితకు అవసరమయిన అసాధారణమయిన ప్రతిభ, సునిశితమైనపరిశీలనా దృష్టి, నిర్విరామ కృషిఅవసరం. అపారమైన నైపుణ్యం, అపూర్వమైన నేర్పు అవసరం. అటువంటి అద్భుతమైన ప్రతిభ, పరిశీలన, పరిశ్రమ, నేర్పు, రచనా నైపుణ్యంగల రచయిత శ్రీ పోతుకూచి సాంబశివరావు. మంచి పాత్రలను సృష్టించి పాఠకుల మెప్పుపొందడమే కాదు, తిరుగుబాటు చేసిన పాత్రలకు కూడా పాఠకుల గౌరవాన్ని, సానుభూతిని, ఆద

రాశి మాన్యాలను పొందే విధంగా చిత్రించగలగటం మన సాంబశివరావు గారి ప్రత్యేకత.

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు వ్రాసిన ఎన్నో మంచికథలు వివిధ దేశ విదేశ భాషలలోకి అనువదించబడి ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టినవి. 1965 సంవత్సరంలో 'గోదావరిగట్టు మీద' కథ జర్మనీభాషలోకి, 1966 సంవత్సరంలో 'బతుకుల పతనం' ఇంగ్లీషుభాష లోకి, 1969 సంవత్సరంలో 'బొమ్మ నడిపిన విప్లవం' 'రాయభారి' కథలు హిందీలోకి అనువదించబడ్డాయి. ఇలా ఎన్నో కథలు అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించినవి.

ఎన్నో మంచి కథలకు కాణాచిలా పేరుపడ్డారు సాంబశివరావుగారు. వారి మాటలే ఒక కథలా వారే ఒకకథలా తెలుగు కథాసాహిత్యంలో ఒక తుఫానులా విరుచుకు పడ్డారు. మంచి కథలను ఇచ్చారు.

# 24

## కవితా సాహిత్యంలో శ్రీ పోతుకూచి

గంభీరమైన తన కంఠంతో అనర్ఘళంగా ఒక పద్యం కానీ ఒక గేయం కానీ అవలీలగా చెప్పగల ధీమంతుడు శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు. వారు ఏది వ్రాస్తే అది ఆణిముత్యమే. వారు ఎన్నో వ్రాశారు.

విద్యార్థిదశలోనే సాంబశివరావు గారికి తెలుగు సాహిత్యంపై అభిమానము, రచయిత కావాలనే అభిలాష కలిగింది.

మొట్టమొదటిసారిగా 1947 సంవత్సరంలో 'జనషాంధుడు' అనే శీర్షికతో పది పద్యాలు వ్రాశారు. కళాశాలలో ఈ కవితకు బహుమతి లభించినది. తరువాత తరువాత వారు వ్రాసినవి పుస్తకాల దొంతరలలో బొండు మల్లెలుగా వచ్చినవి.

వారు వ్రాసిన 'రాసి-సిరా' గేయ సంపుటి (1966)లో కవిత సిరి మల్లెలా చిరునవ్వు నవ్వింది.

తెలుగుభాష తెలిసిన వారందరూ కవిత్వము చెప్పలేనట్లే, కవిత్వం వ్రాయగలిగిన వారందరూ పాటలు వ్రాయలేరు. కానీ ఆ పని మన సాంబశివరావు గారు చేశారు. 'అనురాగం-అను-రాగం' (1967) వారి పాటల సంపుటి. ఇందులోని ఒక్కొక్క పాట తదేకదీక్షతో అవలోకిస్తుంటే అందులో ఏ రెండు మూడు పదాలో కదలి అందెల సవ్వడిగా మొదలై క్రమక్రమంగా మృదుమధురంగా సౌందర్యశోభతో మొత్తం పాట నాట్యం చేస్తుంది. ఆ పాట మధురమైన సంగీత ధ్వనిలో లయలో సాంబశివరావు గారు రచించిన గీతావళి ఈ పుస్తకం. బాగా చేయి తిరిగిన పద్య రచయిత పాట గూడ పద్యంలాగే నడిపిస్తాడు. తన అనుభవాలతో రంగరించి గుండె గొంతుకతో పాటలో పలికిస్తాడు. ఆ రచనలో కవిత్వమెంత ఉంటుందో గొప్ప సంగీత ముంటుంది.

బాధ లోంచి మాధుర్యము మాధుర్యంలోంచి మహదానందంకూడా అందించగల రసఝరి 'రాగం'. రచయిత పేర్కొన్నట్లు 'అలా కరిగి,

ఆవిరిగా మారి, ఘుమఘుమల వాతావరణంలో తేలి, తూలి, సోలి, మనసుం బంధించి, నొకటిపై నొకటి వాలి, దేనికి చలించక కదలి, కదిలే వలపు తలపుల మేలి కలయికలో రాగం అంటే రంగు, రాగం అంటే నాదం, రాగం అంటే అనురాగం నిత్యం పండుతాయి. పల్లవిస్తాయి ' ఈ గీతా వళిలో శ్రీ సాంబశివరావు గారు లలిత లలితంగా ఎంతో లాలిత్యంతో మెరుపులో ఒక తునకగా ప్రేమను ఆమెను ఆవేదనను ఎంతో ఉన్నతంగా పలికిస్తారు. వారిరచనలోని మాధుర్యాన్ని 'నాదేవి'ఖండికలో పూర్తిగాఆస్వా దించవచ్చు. తీయదనం అనుభవించవచ్చు. హాయిని అనుభవించవచ్చు. 'గొంతు నా గుండెలో విందుకున్నాది' అంటారు ఒకచోట. 'గుండె గుబ గుబలాడు గొంతు పెగలదు మాట' అంటారు మరొకచోట. విరహంలో మెలికలు తిరుగుతూ 'తెల్లదూది మబ్బుల్లా తేలు తీయ కలలన్నీ, వాన ముసురు చీకటిలా విరహంతో కమిలిపోయె' అంటారు. అలాగే సుడిగాలిలా గిర్రున వేడి నిట్టూర్పులా బాధగా' అంటూ ఆవేదనలో ఆవేశములో 'నీ రూపు నీ చూపు నీ హృదయం మరపురాదు మరువలేను మరణముసను సాకుదాక' అంటారు. 'ఈ బ్రతుకు అతుకులే చితిమీద పేర్చి ఇహమందు సుఖమంత ఆజ్యముగ పోసి ప్రేమాగ్ని తోడ పెనుమంట రగిలించి వెచ్చని శ్వాసనై నీలోన నుంటి'. అంటూ బాధను విరహంను ప్రేమకు చరమ దశను తటిల్లతలా చూపించారు. 'దూరాన మసిలినా భారమగు బ్రతుకంత నీ రాగముల నింది నీ తలపు లందించు అగ్ని శిఖలను విసిరి ఆవేదనల రగిల్చి తీక్షణ శక్తికి చేశావు ఆహుతిగ' అంటూ దూరమయిన ప్రేమకు దగ్గరతనంను ఎంత హృద్యంగా చెప్పారు. ఆమెను ఆమెప్రేమను చెప్తూ "నీలి కన్నెవు నిన్ను నా కళ్ళ నింపాలి" అంటారు. ఆ ప్రేమలో ఆ మైకంలో 'నీ ప్రేమ నను నిలుపు నీ పాదములు కొలువ" అంటారు

కనుసన్న చూపులో చిన లేత పరుగులో మురిపెముల మౌనంలో విరిసె మన బంధాలు" అంటూ ప్రేమను అనుబంధాలను చెపుతూ తన ప్రత్యేకతను అణువణువును చూపుతారు పోతుకూచి వారు. తన కవితా ప్రతిభను గీతంలో హృద్యంగా సహృదయంతో మాధుర్యంతో పలికిస్తారు శ్రీ సాంబశివరావు గారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు వ్రాసిన కవితా సంపుటిలో "పోతుకూచీయం" (1968) అగ్రస్థానం వహిస్తుంది. "పోతుకూచీయం" ఒక శతకం. లోకంలో ఉండే లోపాలను స్పృశించి విమర్శించారు. రచయిత పేర్కొన్నట్టు "నీతి సూక్తి హాస్యం సత్యం కొంచెం సూటిగా అవసరమయితే మోటుగా చెప్పాననే భావిస్తున్నాను. అందమైన భాషలో అర్థం కాకుండా చెప్పేకంటే చిన్న పదాల కూర్పులో వ్యక్తి చిన్నబరుచు కునేలా ఘాటుగా చెప్పడమే నా భావం. హృదయంలో నాటుకుని గాయం కలిగించినా మానవనైజంలోని లోపాలు అర్థం చేసుకుని మనిషి బాగు పడితే ఈ శతకం ఆశయాలలో కొంతవరకు సిద్ధించినట్లే"

పద్యాలలో ఎంతో చమత్కారము ఉంది. మరికొంత ఎందు కారము ఉంది. 'పోతుకూచి మాట పొల్లుపోదు' అంటూ మకుటాయమైన ఈ శతకంలోని ఒక్కొక్క పద్యం ఒక్కొక్క రసగుళిక. శ్రీ పాద సోమేశ్వరరావుగారన్నారు ఒకసారి 'పోతుకూచి కవిత సాహిత్యరంగంలో నూతన పరిమళపుజల్లు'. సూటిగా బోధలుచేసేకన్న చమత్కారంగా చెప్పే మాటలు శాశ్వతంగా మనసులో నిలిచిపోతాయి. అందుకే కాబోలు వేమన పద్యాలు అజరామరమై నిలిచిపోయాయి. ఎన్నో సంఘటనలు మామూలుగా కనిపించి నిత్యజీవితంలో అనుభవించే ప్రతి విషయము ఏర్చి

కూర్చి ఎంతో నేర్పుగా రచించారు శ్రీ సాంబశివరావుగారు. ఈ శతకంలో మరొక ముఖ్యవిశేషమేమిటంటే వ్యంగ్యరచనతో పాటు ప్రతిపద్యానికి వ్యంగ్యమైన కార్టూన్లను వేయించారు. పద్యంచదివి కార్టూను చూడగానే ఎంత ముభావంగల వ్యక్తి అయినా నవ్వకుండా ఉండలేడు. ఇక్కడే రచయితయొక్క ధీశక్తి ప్రస్ఫుటమవుతుంది. మొదటినుంచి చివరివరకు ఉత్సాహం పుట్టించి ప్రతిపద్యం చదవాలనిపించేటంత నేర్పుగా రచన చేశారు శ్రీ సాంబశివరావుగారు. ఆటవెలదిలో భావంచెడకుండా హాస్యంను భావంనుసమంగా నడిపించిన ధీమంతుడు మన పోతుకూచి.

శ్రీ సాంబశివరావుగారి మరొక రసకందాయం 'సాంబశివానందలహరి'(1976), ఈ ఉత్పలమాల శతకంలోని పద్యాలు 'ఆంధ్రభూమి'లో ప్రచురింపబడినాయి. ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ గోరాశాస్త్రిగారు ఈ పద్య సంపుటికి 'సాంబశివానందలహరి' అని నామకరణం చేశారు. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు చెప్పినట్లు జీవితంలో వారి మొదటి రచన పద్యమే. ఛందస్సు కవితకు రాణింపులేని రోజుల్లో పద్యం రామణీయకత చిరస్మరణీయం కావడానికి చక్కటి ఆలోచనలు, చక్కటి భావాలు పద్యాలలో యిమిడ్చివ్రాస్తే బాగుంటుందన్న ఆలోచనయే ఈ పద్య సంపుటికి ఆవాహన వారికి నచ్చిన పద్యాలు ఇందులో ఎన్నో. అందులో ఒకటి రెండు మరింత మాధుర్యాన్ని అందించేవి ఉన్నవి.

'నీవొక గడ్డిపూవు,మరి నేనొక పోయెడి బాటసారి, ఐ
నా వొకచూపులోనె మన నర్తన రీతులు దృశ్యమాయె,ఏ
మోవొక జన్మలోన మన మొక్కటియై అనురాగమాలికల్
తోవలనింపినామొ, నువు తోడుగరావలె నాకు నీడవై'॥

అంటూ జంటను వెన్నంటిన ప్రేమ మాధుర్యాన్ని అక్షరాల మధ్య అందంగా బిగించారు. వేరొకచోట తన గోదావరిజిల్లా కోనసీమను వర్ణిస్తూ ఎంతందంగా చెబుతారో చూద్దాం.

'అదరికోనసీమ, వరుసన్ కనుపించెను నారికేళ వృ
క్షాదులు, పల్లెదారులను కాల్వలు జంటలై జంటలు ఎదో
విందొనరించె కన్నులకు, విచ్చిన అకులగాలి వీచి మ
ర్యాదలు చేసె రంభలు, విరాజిలు రమ్యవసంత సీమయే'॥

కష్టాలు కల్లోలపర్చే సామాన్య మానవుని పరిస్థితిని కళ్ళకు కట్టినట్లుగా (26) చెప్పగల ధీమంతుడు.

రాజకీయ రంగంలో పాలనాధికారము వహించిన మంత్రిసత్తముని నిలబెట్టి నీ కథ (88) చెప్పమన్నారు. ఎంతో వ్యంగ్య ధోరణిలో ఎంతో మార్దవం పెల్లుబుకుతున్నది అందులో. పెన్షనుతో జీవించే వృద్ధుల మానసిక స్థితిని (88) వారి దైన్యతను ఉత్పలమాలలో తెలియజెప్పారు. ఆ తరువాత పల్లెటి దిక్కుల యువతీ యువకుల ఎద్దులబండిపై వారి ప్రేమ యాత్రను వారి నవ్వులను (96) చెప్పారు. భారతావని గ్రామికచిహ్నంగా (98) నెత్తిన మట్టి తట్టతో ఒంటినిండా వస్త్రము లేని ఆమె గురించి రసోచితంగా వర్ణించగలిగారు సాంబశివరావు గారు.

ఆలోచనలు ప్రధానముగ నడిచిన పద్యాలు ఇవి. ఇందులోని పద్యాలు వాటిలో నిబిడీకృతమైన సంఘటనలలో విశ్వజనీనత ఉందన్న వారి అభిప్రాయంతో ఏకీభవించవచ్చు. నిత్యజీవితంలో తారసపడే ఎన్నో సంఘటనలను ఒక దారంలో ఒక పద్యంలో నిబద్ధం చేయగలిగారు.

హాస్యం, వ్యంగ్యం, భక్తి, శృంగారం, కరుణ ఇలా ఎన్నో రసాలతో రసమంచితం చేశారు. రసానందం పంచిపెట్టారు శ్రీ సాంబశివరావు గారు.

వేరొక రచన శిఖరాలు (1976). ఆధునిక సమాజ రీతులను వచన కవితల్లో నిక్షిప్తం చేయబడినాయి. జాతికి శిరోధార్యాలుగా మానవ మానస శిఖరాలుగా నిలవాలన్న వారి ఆకాంక్ష చెప్పదగ్గది.

'నేటి సమయంలో మెరుపులా మెరియాలి వెలుగు చూపాలి. అందుకే మేలుకో' అంటారు 'ఈ తరుణం ఇక రాదు'లో "కోటికి పడగ లెత్తడం కాదు మన కర్తవ్యం కోటలా నేడు దేశాన్ని రక్షించడం మన కర్తవ్యం" అంటారు "నేటి మన కర్తవ్యం"లో. ఎన్నికల గురించి ఎన్ని కలలు కంటారు ఒకచోట. మరొకచోట శాంతి గురించి ప్రస్తావిస్తూ వారి లక్ష్యం పేర్కొంటూ "నన్ను సాన్నిహిత్య శిఖరానికి చేర్చితే ఈ జన్మ ధన్యం అదే స్వర్గం ఇదే లక్ష్యం" అంటారు.

"స్వేచ్ఛావిషాదం" శీర్షికలో "అన్నీ లేకున్నా చిన్న దీపం" నీడలో దీపం వెలుగదు కన్ను కునుకు తీద్దామంటే ఆకలి చీకటి "సామాన్యుడు ఆనందించక ఏం చేస్తాడు" అంటూ బాధాసర్ప ద్రష్టల దయనీయమైన నిస్సహాయమైన జీవితానికి అద్దం పడతారు సాంబశివరావు గారు. వేరొకచోట 'చరిత్ర పుటల పుస్తకానికి బైండుకుట్టకు చలనమే అరికట్టబడి స్తంభిస్తుంది' అంటారు. గతంలో హింసకు ఆలవాలమైన జీవితాన్ని హృద్యంగా చెబుతారు. వేరొకచోట 'కనుపించే పూతరేకుల మిఠాయివంటిది మన తరతరాల అభ్యుదయపథం' అంటారు ప్రపంచంలోని అభ్యుదయాన్ని అలంకారికంగా.

విప్లవ ఝుంఝూమారుతాన్ని ప్రతిబింబిస్తూ 'అది ఒక ఉవ్వెత్తులా పుట్టే ఉద్యమం అది అన్ని హృదయాల చైతన్య స్వరూపం అది ఉద్భ వించేది సత్యం నిర్భయాల సంగమంలో' అంటారు సంయమనంతో నిష్కర్షగా నిర్భీతితో మన రావుగారు.

'నగరంలో వరదలు' 'నవ్య సూర్యోదయం' ఈ ఖండికలు ఎంతో ఉత్తుంగ తరంగంలా ఉవ్వెత్తున అంతెత్తున విరుకుచు పడతాయి. వారి భాషా తీవ్రతను, వారి భాషాసరళిని విస్తృతం చేస్తాయి. ఒకసారి 'ఈ పారిశ్రామిక ప్రదర్శనలో సంక్రాంతి రోజు కవి సమ్మేళనం ఏమిటి ఎవరు వింటారని ఎవరికి కావాలని అలాఅలా తిరిగివద్దాం పదండి పోదాం ఈ ప్రదర్శన చుట్టూ' అంటూ హాస్యధోరణిలో వ్యక్తీకరిస్తారు. నిజం చెబుతారు.

మనిషిలోని బలహీనతలు నాయకులలోని లోపాలు ఎత్తి చూపించడం ఎవరిని కించపరచడం కాదన్న వారి వాదన ఒక్క పచ్చినిజం. నివురుగప్పిన నిప్పు. అభ్యుదయ కవితా సంపుటి ఈ 'శిఖరాలు' విభిన్న దృక్పధాలకు ఆలవాలమై అలరారింది.

మరొక కవితా సంపుటి చైతన్య కిరణాలు (1984). సాహితీ చైతన్య బిరుదువన్న మన సాంబశివరావుగారి లేఖినితో వచ్చిన ఈ 'చైతన్య కిరణాలు' వారన్నట్లు 'సంచలనం జీవిత లక్ష్యంగా, వాక్కుకు చైతన్యం కలిగిస్తూ' వ్రాసిన కవితలు ఇవి.

శ్రీ పోతుకూచివారిలోని వాడివేడి 'సూర్యుడా! హత్యచేయకు' ఖండికలో నిప్పులు చెరుగుతుంది. 'ఈ గ్రీష్మ ప్రచండ ఉష్ణవాయువులు'

'గడ్డిపరక, తాటాకు దూదిపింజ నిప్పురవ్వల్లా' 'సూర్యుడా నీ ప్రేమ మండిపోను మా భూమికి దగ్గరగావచ్చి మరుభూమిగా మారుస్తావెందుకు' అంటూ 'వీధిలో అనాధులను హత్యచేయకు' అంటూ నడివేసవి మంటలను మరింత ఎక్కువగా మండిస్తారు.

మరొకచోట 'అందుకే మాటమాని మౌనంగా ఉండు మనిషిరూపం వదలి మహామనిషిగామారు' అంటారు, మాటకు బలమిస్తూ శక్తినిస్తూ, డబ్బును గోడౌనులలో పెడుతున్న బడాపెట్టుబడిదారులపై తూణీరంవేస్తూ 'మరణించిటి కష్టాలు నిన్ను దహించాక మరొకడు అనుభవిస్తాడు నీకోట్ల ధనం' అంటారు 'సిగరెట్టు మీద చెణుకులు విసురుతూ 'ప్రియురాలు ఒక సిగరెట్టు' 'అంటుకున్న ప్రేమ అంతందాకా కాలుస్తుంది. కానీ క్షణిక సుఖంలోంచి అక్షయమైన అనుభూతిని అందంగా అందిస్తుంది' అంటారు 'భార్య ఒక బిల్లుకట్టు' అంటూ స్వారీ చేసేభర్తను, చిల్లులు పొడిచి చివరకు కాలువలో ముంచే భర్తయొక్క భేషజాన్ని అక్షరాల వరసల్లో ఎంతో చక్కగా చెబుతారు. 'నీతి నిజాయితీల విలువలేని ఈనాడు బతుకులో గిరీశాలుగా మారడం నేటి ఎమర్జన్సీ' అంటారు ఒకచోట. వారి భాషా తీవ్రతకు ఇది ఒక ఉదాహరణ.

జీవితంలోని ఆనందాన్ని చెబుతూ 'బ్రతుకనేది ఒక చిన్న స్వప్నం మతిని నిలిపి అనుభవించు' అంటారు ఎంతనిజం ఈ మాట. మరొకచోట "ప్రేమలేక బ్రతుకు జీవి నీరులేని లోతుబావి' 'పార్టీని నమ్మివేసేవోటు వ్యక్తిప్రవర్తనగలవాన్కి వెన్నుపోటు' అంటారు ఎంతో అర్థవంతంగా. మరొకచోట సేవలను, సేవకులను విశ్లేషిస్తూ 'సేవల జీవితనౌక ప్రతిబింబం సేవకునిరూపం' అంటారు. మరొకచోట మంచితనం గురించి అది

ఈ రోజుల్లో పడుతున్న పాట్లు గురించిచెబుతూ 'మంచితనం నేడు పెడిమ అంచు చివరిమాట మోసము చేయడమే మనుజులు మరిగిన పెద్దఆట' అంటారు. శ్రామికజాతి బాధలను అంధకారంను తెలియజెబుతూ 'నేడు ధరనునడిపి మోసేభారంతో కదిలేవెలుగు సర్వశతసహస్ర శిరోభూషణం నేటి శ్రామికజాతి' అంటారు. ఇందులో వీరు వ్రాసిన 'నిర్వచనాలు' 'స్వప్నంలోసత్యం' వారిరచనాశైలిని తచనలోని ఉద్వేగాన్ని విశిష్టంగా పాఠకులముందు ఉంచుతాయి. 'చైతన్య కిరణాలు' శీర్షికలోని కవిత ఈ గ్రంథంలో ఒక హైలైట్. 'జాతీయ సమైక్యత' మరోచక్కని మినీకవిత. మరొకచోట 'ఒక సూర్యునిచూసేశక్తిలేని నీ కన్ను ఒక్కసారి శతకోటి సూర్యుల నెటులచూడగలుగు' అంటారు. వేరొకచోట 'నా నేత్రాలు సూత్రాలు ఆ దివ్యసుందర నవ్యదీప్తివైపు చూస్తున్నాయి నేనందుకే చూస్తున్నానటు' అంటారు.

వారి ఆలోచనా సరళివేరు. వారి ఆలోచన నవ్వులేకాదు నిప్పులు కక్కుతుంది. జనంనాలికలపై విజృంభిస్తుంది. చివరగా వారన్నట్లు 'ధన దాహం పెరిగిపోయిన ఈ భజన కవులయుగం అంతరిస్తేకాని కొత్తతరం కొత్తచైతన్యంతో రావడంకష్టం. ఆ చైతన్యం కలగాలనీ నాందిగా, నిర్భయంగా, హృదయాలకు హత్తుకునేలా సత్యం ప్రధానంగా ఈ కవితలు' వ్రాశానంటారు. ఆ మాటలు అక్షరసత్యమే. నిత్యచైతన్యమే.

ఇలా ఎన్నో కవితలు ఎన్నో సంపుటులుగా ఆకృతి పొంది మన ముందుకు వచ్చాయి. ఏ కవిత చూచినా వారి త్రివిక్రమావతారం గురుతుకు వస్తుంది. అవినీతిని అన్యాయంను ఎలా పరుశురాముడిలా నరుకుతారో అర్థమవుతుంది. ఒక్కొక్క కవితలో ప్రేమపుడుతుంది. మరొక కవితలో

నిప్పు మండుతుంది. ఈ కవితలు మనిషిలోని మానవుడే వ్రాస్తాడు. నరసింహావతారం దాల్చి మరీ వ్రాస్తాడు. శ్రీ సాంబశివరావుగారి వ్యక్తిత్వం, వారు తమ మాటను కవితల్లో వ్యక్తీకరించిన పద్ధతి అమోఘం అద్భుతం. అపురూపంగా షెల్ఫులోకాదు గుండెల్లో దాచుకోవలసిన అక్షర లక్షల విలువల కవితలు ఇవి.

# 25

## శ్రీ పోతుకూచి కావ్యసాహిత్యంపై వచ్చిన విమర్శనా గ్రంథాలు

'విశ్వసాహితి' సమరాంగణ చక్రవర్తి శ్రీ పోతుకూచి వ్రాసిన కావ్యసంచయంలోని కొన్ని గ్రంథాలను మిత్రులు యువకులు పరిశీలించి, పరిశోధించి ఎంతో ఉన్నతంగా ఉత్తమంగా విమర్శనా వీచికలను ప్రచురించడం జరిగింది.

మిత్రులు రుద్రశ్రీ (చిట్టిమల్లె శంకరయ్య) గారు శ్రీ పోతుకూచి సాంబశివరావు గారు రచించిన 'సాంబశివానంద లహరి' శతకంపై ఎంతో చక్కని సాహిత్య విమర్శ చేశారు. ఈ ఉత్పలమాల శతకంపై వారు మంచి విమర్శను అక్షరరూపంలో అభివ్యక్తీకరించారు. రసికాధ్వని పరంపరా లహరికలలో సాంబశివానందలహరి ఒక ప్రత్యేక నూత్నధ్వనిని నినదించు లహరి అంటూ ప్రశంసించారు. శతకరచనలో చాద స్తపు వైవిధ్యా

ల్లను శ్రీ సీరాజని కేవలం వందపద్యాలనే వ్రాసి నవీనతను ఆపాదించినా రన్నారు. అంతేకాదు మకుటంలేకుండా శతకం వ్రాసి మకుటంలేని మహారాజయ్యారన్నారు. నేటి అత్యాధునికకాలంలో ఛందోనియమాలు విడిపోతున్న సమయంలో వారు ఛందస్సుననుసరించి వ్రాయుట, వృత్తముల ప్రయోజనం తెలుసుకొని వ్రాయడం జరిగిందన్నారు. ఉత్పలమాల వృత్తమును ఎన్నుకొని వ్రాసినందున అంతా శుభప్రదం గావున తద్వారా సాంబశివానందలహరి పేరు గూడా ఎంతో శుభప్రదమయిందని చెప్పుకోవచ్చునని అన్నారు.

సాంబశివానందలహరి శతకమునందు వాడిన పద్యభావముల ననుసరించి శృంగార హాస్యరసములకు సంబంధించిన వేళాక నిర్వేదము కూడా ప్రస్ఫుటించి భావయుక్తమయిన పద్యములను ప్రధానంగా వ్రాశారని, ఏ పద్యము పరిశీలించినా గణభంగము లేకుండా సహజ ధారతో నడిచిందని పేర్కొన్నారు. ఏదియు ప్రయత్నపూర్వకముగా వ్రాయలేదని అనర్గళధారతో ఆవిష్కరించారని దేశీయఛంద పద్యములలో వాడు ప్రాస యతిని వృత్తములలో కూడా ప్రయోగము చేసినారని వృత్తపద్యములకు క్రొంగ్రొత్త సోయగమును సంతరింపజేసి నవీనతను ప్రతిష్ఠించినారని తెలియజేశారు.

రుద్రశ్రీగారు హాస్యరస పద్యములను విమర్శిస్తూ ఒక్కొక్కప్పుడు ఆధునిక చిత్రకారుడు కుంచెనుబట్టి చిత్రించిన హాస్యపూరిత కార్టూనులా పద్యంను తన లేఖిని ద్వారా జాలువార్చగలరంటూ సాంబశివరావుగారిని ప్రశంసించారు. వారి శృంగార పద్యాలను గురించిచెప్తూ రాగోద్దీపనగా భావోద్వేగంతో శృంగారం రసతన్మయత్వం చిప్పిలుతుందని అంతేగాక

మానవమానస విశ్లేషణ కూడా స్ఫురిస్తుందని, అత్యంత రమణీయ భావనా కలితగల భావములకు తగ్గ చక్కటి లలిత శబ్దమయ రమ్యతతో మల్చబడినవని ప్రస్తుతించారు. భక్తిపరమైన ఆత్మానుభూతి అదే ఆత్మాశ్రయత సాంబశివానందలహరిలోను కలదన్నారు. ఊసరవెల్లిలా రంగులుమార్చే రాజకీయరంగంగూర్చి యధార్థాన్ని యెల్గెత్తి చాటినారని తెలియజెప్పారు భావుకతతో పల్లెపడుచుల సహజ సౌందర్యాన్ని వర్ణిస్తూ దివ్యజగత్తులో విహరించారని అంతేకాదు దూరతీరాలకు భావనాజగత్తులో రెక్కలుగట్టుకు వ్రాలి వినిర్మల ఆనందమయ లోకాలను భావచక్షువుల ద్వారా తిలకించిన మహాభావుకునిగా శ్రీపోతుకూచిని రుద్రశ్రీగారు అభివర్ణించారు.

చివరలో రుద్రశ్రీగారు శ్రీ సాంబశివరావుగారి 'సాంబశివానందలహరి'లోని కవిత సమాజంలోని స్థితిని అద్దంలో చూపి మానవమానస కల్మషాన్ని పోగొట్టాలని ఆకాంక్షించారు.

రుద్రశ్రీగారు తమ సాహితీ విమర్శను పాతకొత్తల మేలుకలయికతో, సందర్భోచితమైన వ్యాఖ్యలతో ఎంతో చక్కగా ఆవిష్కరించారు.

రెండవది సాహితీ చైతన్య శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి వచనకవితల మణిమయహారం 'చైతన్య కిరణాలు'ను పుష్యమిగారు తనంత అందంగా కవితా విమర్శ చేశారు.

అకళంక చైతన్యదీప్తి కలిగి ఉండు మనిషి మనసులో కాంతి మనసులో కాంతి కొలువుంటుందని సత్యనిలయమవుతుందని భవబంధాలను విడనాడి ప్రజా సేవకు అంకితం కమ్మని అప్పుడు నిత్యజీవితం ఆనందమవుతుందని శ్రీ పోతుకూచి వారి మాటలను విశదీకరించారు. కాంతిపుంజాన్ని

కూడా కలిసించే రాజకీయ కార్యకర్తలను అర్థంచేసుకొని ఆలోచించేటట్టుగా వారిలోని లోపాన్ని ధైర్యంగా తన కలంతో వారిగొంతులు పెగలకుండా చేసిన శ్రీ పోతుకూచిని ప్రశంసించారు. చీకటిలో తిరిగే అంధులకు ఒక వెలుగు బిందువు స్త్రీ ఈ జీవితపు ఆలిచిప్పలో పొదిగిన ముత్యం ఆమె అంటూ అతని మనస్సులోని ప్రేమను పేపరు మీద ఉంచి మనలనుఅతని చక్కని సాహిత్యంతో మరిపిస్తున్నారు పోతుకూచిగారని పుష్యమిగారు ఎన్నో ప్రశంశలను కురిపించారు. నేటి సమస్యల వలయంలో ఏదైనా సమిష్టిగా అంతచ్ఛక్షువు ద్వారా చూస్తే మంచిమార్గం తెలుస్తుందని అన్న సాంబశివరావుగారిని అభినందించడం జరిగింది. రచన చాల రమ్యంగా ఎవరికైనా అర్థమయే విధంగా వ్రాసిన పోతుకూచి వారిని అభినందించారు.

ఏదొక విధంగా అంటే వ్యాఖ్యానంతోనయినా వెక్కిరింపుతోనైనా విమర్శతోనైనాపొగడ్తతోనైనా మన యువతరంలో మార్పుతీసుకురావడం కోసం శ్రమిస్తున్న పోతుకూచిగారిని, వారిపట్టుదలను ప్రస్తుతించారు.

ఈనాటి సర్వమతసామరస్యాన్ని గూర్చి చాలరమ్యంగా రమణీయంగా అందరికీ అర్థమయి అది తప్పని తెలుసుకొని మెంగేరీతిలో చాల చక్కగా వర్ణించిన శ్రీ పోతుకూచిని అభినందించారు. దేశసమైక్యత సమగ్రతలమీద సాంబశివరావుగారి కవితను ప్రశంసిస్తూ అఖండమైన జ్యోతిలా ఉదయభానుని కంటే శక్తిని పెంచుకొని మనలోని సమైక్యతాభావం ప్రజ్వరిల్లి దుర్మార్గులగుండెలు ఝల్లుమనేలా వారు అడుగువేసి మనలను అడుగు వేయమంటారు పోతుకూచిగారని తెలియజేశారు. భావకిరణాల వెలుగులను భావగర్భితంగాకాక బహిర్గతంగా భావిభారత పౌరులు చూసి బ్రతుకును సరి

దిద్దుకోవాలనే ఆశతో బండరాళ్ళను గూడా బంగారులలనలుగా తీర్చి దిద్దగలనేర్పు శ్రీపోతుకూచి కవితలలో సమగ్రదర్శనం జరిగిందన్నారు పుష్యమిగారు. ఎంతకష్టకాలంలోనైనా సత్యాన్ని విడనాడకుండా వుంటే అది అతనిని ఎంతోసుఖమయం చేస్తుందన్న నిత్యజీవిత సత్యాన్ని వివరించిన శ్రీ పోతుకూచిని అభినందించారు.

చివరలో సాంబశివరావుగారి చైతన్య కిరణాలు చదువుతుంటే సాహితీ అభిమానులకేకాక సరసులకు సంస్కారులకే కాక చివరికి కదలలేని బండరాయిలో గూడా చైతన్యం తెప్పించగల నేర్పు వారికవితల్లో కనుపిస్తున్నదని వారిని ఎంతో ప్రశంశించారు పుష్యమిగారు.

మూడవది. మనకు నచ్చిన వ్యక్తి పుస్తకంగూర్చి మన మెందుకు వ్రాయగూడదన్న భావంతో శ్రీ సాంబశివరావుగారి 'పోతుకూచీయం' పుస్తకంపై వ్యాఖ్యానం చేశారు శ్రీ గోవిందపురం శ్రీశైలంగారు. వీరు యువరచయిత. వీరి రచనలలో సంప్రదాయకత ప్రతిఫలిస్తుంటుంది. రచనారంగంలో శ్రీ పోతుకూచి సన్నిహితులయిన శ్రీశైలంగారు సాంబశివరావుగారి 'పోతుకూచీయం' పైతన అర్థవంతమైన వ్యాఖ్యానాన్ని వెలువరించడం సముచితం

'పోతుకూచిమాట పొల్లుబోదు' అన్న మకుటంతో వెలువడిన ఈ కావ్యం ఎంతో ఔన్నత్యాన్ని సంపాదించినదన్నారు. శ్రీ పోతుకూచిమంచి మాటలే జెబుతాడు అంటూ రమ్యాభిరుచులకు ఈ కావ్యం నాందీప్రకరణం అంటూ ప్రకటించారు. అనవసర ఆలోచనలజోలికి పోయితప్పటడుగులు వేయరాదన్న సందేశం వారి పద్యాలలో కనిపిస్తున్నదన్నారు. ఆచరణలో పెట్టడానికికాని, ఒకపనిని ప్రారంభించడానికిగాని ముందు వెనుక

ఆలోచించడం మంచిదని తాత్కాలిక ఉద్రేకంలో ఏ పని చేయరాదని పసందైన పద్యాలలో శ్రీపోతుకూచి పొందు పరచారని అభినందించారు.

ఎంత హాయిగా బ్రతికినా ఎన్నికష్టాలుపడ్డా భూమ్మీద అందరూ సమానులే చివరకు గాలిలో కలిసి పోవలసిందే ధూళిలో కలసిపోవలసిందే. ఎందుకీ ఆడంబరాలు మనస్పర్థలు అన్నతపన శ్రీ పోతుకూచి పద్యాలలో కనుపించినదన్నారు. ప్రేయసిప్రియులు తమ రసాస్వాదనకు తరచి తరచి ప్రణాళికలు వేసుకోవాలని అన్న శ్రీ పోతుకూచి మాటలను నవీన పద్ధతిలో వ్యాఖ్యానించారు. న్యాయాన్ని ఆటపట్టించే పద్ధతిని గూడా తన హాస్యపద్ధతిలో వెలువరించిన శ్రీ పోతుకూచిని అభినందించారు, అంతేకాదు చమత్కారంగా హాస్యాన్ని కలిగించడం శ్రీపోతుకూచికి అలవాటని ప్రస్తుతించారు. చనిపోయిన వారి పేరు మీద చందాలు వసూలుచేసేవారిని, కార్యకర్తలు వివాదాలతో కోర్టుకువచ్చే పద్ధతిని చమత్కారంగా వివరించిన శ్రీ పోతుకూచిని ఎంతో ప్రశంశించారు శ్రీశైలంగారు.

చివరలో శ్రీశైలంగారన్నట్లు జీవితాన్ని సహనంతో ఎదుర్కొన్న వారేగదా ఇతరులకు మార్గదర్శకులవుతారు. అనుభవ మధనం నుంచి ఇంత సందేశాన్ని పంచిపెడ్తారని, అందుకే వేమన, నార్ల, పోతుకూచిగారలు రచయితలుగా సాహిత్యంలో శాశ్వతంగా నిలుస్తారని అన్నారు.

శ్రీ పోతుకూచివారి రచనలతో ప్రభావితులయి రచనలపై తమ వ్యాఖ్యానాలను విమర్శలను ప్రకటించిన రచయితలు నిజంగా ఎంతో ప్రశంశార్హులు. శ్రీ పోతుకూచిని ఇంత ఘనంగా సత్కరించడం సాహిత్యాభిమానులకు ఎంతో సంతోషం కలుగజేసింది.

# 23

నటుడుగా
నాటక రచయితగా
ప్రయోక్తగా
శ్రీ పోతుకూచి

సుమారు 40 సంవత్సరముల క్రితం కాకినాడలో పిఠాపురం మహారాజా వారి కాలేజీలో శ్రీ సాంబశివరావు గారు చదువుకునే రోజుల్లో ప్రతి సంవత్సరం ఆంధ్రాభ్యుదయోత్సవాలు జరుగుతుండేవి. అందులో ప్రతిరోజు సాహితీ సదస్సులు, సంగీత పోటీలు, నాటక పోటీలు ఉండేవి. ఆ సమయంలోనే శ్రీ సాంబశివరావు గారు తను వ్రాసిన 'ఇదీ తంతు' నాటకంలో నాయకుని పాత్ర వేశారు. ఆ నాటకం చిన్నదయినప్పటికీ బాగా కృషి చేశారు. రచన, నటన, ప్రదర్శన బాగా వున్నవని పెద్దలు ప్రశంసించారు.

అటు తర్వాత 'ఆంధ్ర జ్యోతి' పెద్ద నాటకం ప్రదర్శనకు తీసుకున్నారు. ఆ నాటక ప్రదర్శనకు షుమారు నెల రోజులకు పైగా కృషి చేయవలసి వచ్చింది. అందులో సాంబశివరావు గారు తండ్రి పాత్ర చాల చక్కగా పోషించారు. బహుమతులు అందుకున్నారు.

శ్రీ సాంబశివరావుగారు స్వయంగా నటుడు. నాటకకర్త దర్శకుడు నటుడైన వ్యక్తి రచయితగా వ్రాసిన నాటకాలు రంగస్థలంపై ప్రదర్శించ

దానికి మిక్కిలి అనుకూలంగా ఉంటాయి. తను స్వయంగా వ్రాసిన నాటకాలలోనే కాదు ఇతరులు వ్రాసిన వాటిలో వేశారు. వారు పాత్రలో జీవిస్తారు. నలుగురిని మెప్పిస్తారు. పట్టుదలతో తన నటనకు రూపకల్పన చేస్తారు. నటుడనిపిస్తారు.

శ్రీ పోతుకూచి రచించిన హంతకులు (1969) నాటకం ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే ఉత్తమ నాటకంగా నిర్ణయించబడి బహుమతి పొందింది.

వీరి 'పల్లె కదిలింది' (1971) నాటకం ఆంధ్రదేశంలో అనేక చోట్ల దిగ్విజయంగా ప్రదర్శించబడింది. రచయిత పేర్కొన్నట్లు అంతర్గత విభేదాల వల్ల, అంతరాంతరాల తారతమ్యాల వల్ల ఏ సమాజమైనా అధోగతికి దిగజారుతుంది. ఈ ఉద్దేశ్యమే ఈ నాటకంలో ప్రతిధ్వనిస్తుంది ఈ నాటకంలో ప్రముఖమైన ముసలయ్య పాత్ర నిజమైన పాత్రగా మలచబడింది. సంఘటిత శక్తితో ఒక కొత్త శుభోదయంతో పల్లె కదులుతుంది.

శ్రీ సాంబశివరావు గారు వ్రాసిన దృశ్య నాటికలలో "దొంగ" చాలా ప్రసిద్ధి చెంది తెలుగు ప్రజల మన్ననలందుకుంది. భావ ప్రకటనలోనూ, గంభీరతలోనూ 'దొంగ' నాటికకు సరియైనది మరియొకటి లేదంటే అతిశయోక్తి కాదు. దొంగగా ముద్ర వేయబడ్డ మనిషి కథ ఇది. తనచుట్టూ ఉన్న పతనమయిపోయిన ప్రపంచం చూస్తాడు. తెల్లటి బట్టల్లో దొంగలను చూస్తాడు. మోసగాళ్ళను చూస్తాడు. నాటికలోని పతాక సన్నివేశంలో రచయిత చూపించిన నేర్పు కొనియాడతగినది.

శ్రీ సాంబశివరావు గారు వ్రాసిన మరొక మంచి నాటిక 'ఇదీ

తంతు'(1956) భార్యలోని గయ్యాళితనాన్ని పోగొట్టాలని చివరకు పిచ్చాసుపత్రి పాలయి తరువాత సుఖాంతమయిన చక్కని నాటిక ఇది. చక్కని హాస్య సన్నివేశాలతో నిండివుంది. 'పిచ్చివాళ్ళ' స్వర్గంలో సంభాషణా చాతుర్యం మరింతగా ప్రస్ఫుట మవుతుంది.

ఇంకా ఏడు సున్నాలు (1953) దొర(1958) మరికొన్ని నాటికలు వ్రాశారు. పండిత పామరులను దేశకాల పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని శ్రీ పోతుకూచి నాటికలను వ్రాశారు. నటించారు. దర్శకత్వం వహించారు. చదివినా ప్రదర్శించినా మనోరంజకంగా ఉంటాయి. ఔచిత్యము రససిద్ధి కూడా వారి నాటికలలో ప్రత్యేకత.

ఆధునిక నాటక సాహిత్యంలో శ్రవ్య నాటికల స్థానం విశిష్టమైనది 'ప్రతిధ్వనులు' (1954) అనే సంపుటిలో పది శ్రవ్య నాటికలున్నాయి. ఈ నాటికల యితివృత్తం జీవితంలో ప్రతి నిత్యమూ జరిగే వివిధ సంఘటనలు. ఈ నాటికలలోని పాత్రలు కూడా నిత్య జీవితం లోనివే కావటం వల్ల ఆయా వ్యక్తులు మనకు బాగా తెలిసిన వ్యక్తులే అని ఆశ్చర్యము కలుగుతుంది. ఇందులోని ప్రతి నాటిక రచయిత యొక్క ప్రతిభా వ్యుత్పత్తులను భావనాశక్తిని వ్యక్తం చేస్తున్నాయి. ఇందులోని కొన్ని నాటికలు 'పెళ్ళి పిలుపు, రెండు నాలికలు, అంత్యక్రియలు, అద్దెకొంపలో ఒకనెల' ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారమై శ్రోతల అభినందన పరంపర లందుకున్నాయి. ఆకాశవాణిలో ప్రసారమైన నాటికలలో శ్రీ సాంబశివరావు గారు స్వయంగా పాల్గొన్నారు. వారు స్వయంగా రేడియోలో ఏ-క్లాసు ఆర్టిస్టు. శ్రీ సాంబశివరావుగారు స్వయంగా నటుడు. అందు చేతనే వారి నాటికలు ప్రసిద్ధి లోనికి వచ్చాయి.

మరికొన్ని నాటికలు 'స్వాముల వారు, కాలక్షేపం, గృహంలో ప్రజాసౌమ్యం, వితంతు వివాహం తిరుగుబాటు, చుట్టాల రభస' వివిధ పత్రికలలో ప్రకటింపబడ్డాయి. వీరి ఒక్కొక్క నాటిక ఒక మచ్చుతునక చదివితే మళ్ళా చదవాలనిపిస్తుంది. ఈ నాటికలు నవరసాల ప్రాధాన్యత కలిగి సామాజిక శ్రేయస్సు ఆనందమునకు ప్రతీకలుగా నిలిచాయి. అందలి కథాభాగము, పాత్రల మానవ పరమార్ధము విశ్వమానవ సౌభాగ్యము ప్రతిబింబించి ప్రసిద్ధి చెందినవి. నాటకీయత సంతరించుకున్న ఈ దృశ్య శ్రవ్య నాటికల ద్వారా శ్రీ సాంబశివరావు గారు తెలుగు ప్రజా హృదయాలలో శాశ్వత స్థానం సంపాదించుకున్నారు. వారి నాటక రచనలలో సంమసంస్కరణ మొదలు పయోముఖ విషకుంభాలను బట్టబయలు చేయడం మొదలగునవి శ్రీ సాంబశివరావు గారు నిర్భయముగా, నిర్మొహమాటంగా తెలుగు ప్రజలకు చూపించారు. వారి పాత్రలు సన్నివేశమునకు అభినయమునకు భంగము కలుగకుండా రసమంచితంగా సృష్టించబడ్డాయి.

అంతేకాదు ఎన్నో ఏకపాత్రాభినయాలను (1978) వ్రాశారు. ప్రచురించారు. అభినయించారు. వారి నటనా వైచిత్రికి అచ్చెరువొందారు జనం.

శ్రీ సాంబశివరావు గారు కవే కాదు, గాయకులు. నాటక రచయితలే కాదు మహానటులు. అందుకే సాహితీ విద్యాలయలో నాటక శిక్షణా తరగతులను నిర్వహిస్తున్నారు.

అనేక ఆంధ్ర నాటక కళా పరిషత్తు మహాసభలకు వీరు సారధులే కాక నాటక పోటీలకు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు

నాటకరంగం వీరి అభిమాన పాత్రమైన విషయం. వీరిలో నటన ఉంది. దాన్ని వెలువరించే శక్తి ఉంది. వీరిలో నాటక రచనాశక్తి ఉంది, నాటకీయత సృష్టి ఉంది. ప్రయోక్తగా వక్తగా ప్రదర్శింపగలరు, వారు మూర్తీభవించిన నటులు.

## 2

### పోతుకూచి ఫిలిమ్స్

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారి కళాభిజ్ఞతకు చైతన్యానికి కొత్తదనానికి మరో మైలురాయి పోతుకూచి ఫిలిమ్స్ విజయదశమి (1986) రోజున ప్రొడక్షన్ సంస్థను ఏర్పాటు చేయడం, నటీనటుల ఎన్నిక చేసి శ్రీమతి రశ్మి భవాని కథాకల్పన "ది బర్నింగ్ బ్రైడ్" తెర కెక్కించడానికి ప్రయత్నాలు మొదలు పెట్టారు. తెలుగు హిందీ భాషలలో నిర్మించే ఈ చిత్రానికి దర్శకత్వం వహించి చిత్రంలోని అన్ని రంగాలను పర్యవేక్షిస్తూ తన విశేష సహాయసహకారాలనుఅందిస్తున్నారు.

చిత్రం నిర్మించడానికి కావలసిన ప్రతి విషయము కూలంకషంగా చర్చించడం సమిష్టి చర్చలతో చిత్రం నిర్మించడం వారి ఆశంశ.

గతంలో శ్రీ సంజీవయ్య గారి మీద డాక్యుమెంటరీ నిర్మాణంలో

తన ప్రజ్ఞను నిరూపించుకోవడం ప్రత్యేకంగా స్వంత ప్రొదక్షను ఏర్పాటు చేసుకోవడానికి అవకాశ మిచ్చింది.

గ్లామర్ లోకమయిన ఫిలిం ప్రపంచం లోకి వచ్చి తన ఆశయాలకు ఒక చిరంజీవత్వం కల్పించడం ముఖ్యమైన విషయం. వారిలోని కళాభిమానం వారిలోని చైతన్య స్వరూపం వెండితెర మీద మనం చూడగలం.

కొత్తదనంలో అగరుధూపమై ఆశయాల రూపకల్పనలో నెత్తావులు వాసనలు విరజిమ్ముతూ వారిదంటూ ఒక స్థానం ఏర్పడడం తధ్యము. తెలుగు ప్రజలకు గర్వ కారణంగా తెనుగు సంస్కృతికి దర్పణంగా వెలుగొందగలరు పోతుకూచి వారు.

# 28

## పోతుకూచి గ్రూప్

మనం పోతుకూచి గ్రూప్ గురించి ఆలోచిస్తే అందులో చైతన్యం ఉంది. చేవ ఉంది. ఆనందం ఉంది. లలిత కళల పట్ల ఆరాధనా భావం ఉంది.

సంగీతం, నాటకం, నృత్యం మున్నగు సాంస్కృతిక ప్రక్రియలలో ప్రచార ధోరణిలో వివిధ కార్యక్రమాల నేర్పాటు చేయడం కోసం పోతుకూచి గ్రూప్ ఏర్పాటు చేయడం జరిగింది.

పోతుకూచి గ్రూప్ ఆధ్వర్యంలో ఎన్నో సాంస్కృతిక కార్య క్రమాలు నిర్వహించారు, జానపద నృత్యాలు ప్రదర్శించారు. నాటకాలు వేశారు. హరికథలు చెప్పారు. మిమిక్రీ కార్యక్రమాలు, సంగీత కార్యక్ర క్రమాలు ఏర్పాటు చేశారు. వీటన్నిటి వెనుక కొండంత పట్టుదల ఉంది సత్తా ఉంది. నైపుణ్యం ఉంది. వీటన్నిటికి వెనుక మన పోతుకూచి సాంబ శివరావు గారు ఉన్నారు.

ఎందరో కళాకారులు తమ ప్రతిభను పోతుకూచి గ్రూప్ ద్వారా చూపారు. అభినయం చేశారు. సాంబశివరావు గారి నిర్దేశకత్వంలో ఆట-పాట ఎన్నో రకాలుగా వైవిధ్యంతో వెల్లివిరిశాయి. వేలెత్తి చూపలేనంత వరకు ఎదిగారు. ఏఏ తారీఖున ఏఏ సాంస్కృతిక కార్యక్రమము నిర్వ హించారన్నది అప్రస్తుతము. కానీ వాటిని ఏర్పాటు చేయడం ఒక ప్రశంశ నీయమైన విషయము

నివురు గప్పిన నిప్పులా అణగిమణగి ఉన్న, నిద్రావస్థలో ఉన్న, చేవ గలిగి చేయూత దొరకని కళాకారులకు వ్యక్తిగా గానీ, సమిష్టిగా గానీ పోతుకూచి వారు అండగా నిలచారు. ఎప్పుడు ఎక్కడ కార్యక్రమ మన్నా కళాకారులు వచ్చారు. వారి నైపుణ్యం చూపారు. సాంబశివరావు గారి పిలుపు వారి కొక అమని పిలుపు.

పోతుకూచి గ్రూప్ అందుకే సాంస్కృతిక రంగంలో అశేషమైన మన్ననలను పొందింది.

# 29

## చైతన్య సేన

'భారతజాతి చైతన్యవంతంగా రాజకీయ ఆర్థిక సాంఘిక సాంస్కృతిక రంగాలలో సర్వతోముఖ పురోభివృద్ధి పొందేలా నీతినిజాయితీలతో సర్వదా కృషి చేస్తానని ప్రమాణం చేస్తున్నాను' అంటూ చైతన్యసేనలో చేరే ప్రతి సభ్యుడు సుశిక్షిత సైనికుడిలా శ్రీ పోతుకూచి సాంబశివరావుతో చేయి చేయి కలిపి ముందుకు, మును ముందుకు అడుగు వేస్తున్నాడు.

చైతన్యసేనను గురించి ఆలోచిస్తే అందులో సేవాభావం, వివిధ సమస్యలపై సమగ్ర ఆవలోకనం ఉంది. స్పందన ఉంది. చేయూతఉంది. సహకారం ఉంది.

శ్రీ పోతుకూచి వారు చైతన్యసేనను ఎంతో సమర్థవంతంగా నడుపుతున్నారంటే వారు నిర్దేశించిన లక్ష్యాలు, ఏర్పరచిన నియమాలు ఎంత గొప్పవో అర్థమవుతాయి.

ప్రజా సమస్యలు ప్రజాసౌమ్య రీతిలో శాంతియుతంగా పరిష్కరించుట ప్రజలలో చైతన్యం కలిగించి పౌరులుగా తమ హక్కులు బాధ్యతలు గుర్తెరిగి ప్రవర్తించునట్లు చేయుట. నీతి నిజాయితి క్రమశిక్షణ

కలిగి కులమత భేదాలు లేని సమసమాజ స్థాపన, ఎన్నికలలో పౌరులుగా తమ ఓటు హక్కు మంచి అభ్యర్థుల కిచ్చి బలపరచుటకు ప్రయత్నించుట అలాంటి వారిని పార్టీలతో ప్రమేయంలేకుండా బలపరచుట. ఐకమత్యంతో ప్రవర్తించి కష్టసుఖాలలో పాలు పంచుకొనుట: వ్యక్తిగత నిందలకు పోకుండా ప్రజా సమస్యలు విశాల దృక్పథంతో పరిశీలించి పరిష్కరించుట. నిరక్షరాస్యులకు విద్యా కార్యక్రమాలు చేపట్టుట. కులమత విభేదాల దృష్టి లేకుండా ఆర్థికంగా బలహీనమైన వర్గాలకు సహాయపడుట. ఇలా ఎన్నో కార్యక్రమాలతో సామాజిక స్పృహతో చైతన్యసేన ముందుకు పోతున్నది.

చైతన్యసేనను కదిలిస్తే అది సుశిక్షితమైన ఒక సంస్థ. ఎప్పుడు ఎక్కడ ఏ సమస్య వచ్చినా స్పందిస్తుంది. ప్రజల లోకి వెళుతుంది. వారి నాడి చూస్తుంది. చర్చలు గోష్ఠులు సమావేశాలు ఏర్పాటు చేస్తుంది. చైతన్యసేన ఏర్పాటు చేసిన కార్యక్రమాలను పరిశీలిస్తే అది ప్రజలకు ఎంత సన్నిహితంగా ఉందో అర్థమవుతుంది.

రోడ్డు రవాణా సంస్థ వారు నడిపిస్తున్న బస్సుల వల్ల ప్రజలకు కలుగుతున్న ఇబ్బందులను రవాణా సంస్థ అధికారుల దృష్టికి తెచ్చారు. గుంటూరు కృష్ణా జిల్లాలలో బస్సు కండక్టర్ల అమర్యాద ప్రవర్తన, బస్సు స్టాండులలో బస్సుల నాపకుండుట మొదలగునవి రవాణా సంస్థ దృష్టికి తెచ్చారు. బస్సు స్టాండులలో ప్రయాణికులకు అవసరమగు ఆహార పానీయాల సదుపాయాలు లేవని శ్రీ పోతుకూచి ఫిర్యాదు చేయగా అధికారులు అవిసరిదిద్దుటకు ప్రయత్నించినారు. జంటనగరాలలోకూడా బస్సుసౌకర్యములు సరిగా లేవని ఎక్కువ బస్సులు ఏర్పాటు చేయవలసిందిగా శ్రీపోతు

కూచి చైతన్యసేన ద్వారా విజ్ఞప్తి చేసినపుడు రవాణా సంస్థ మరికొన్ని బస్సుల నేర్పాటు చేసినారు.

ధరల పెరుగుదల గురించి, స్కూటరు యజమానులు హెల్మెట్స్ ధరించడం గురించి సమావేశాలు జరిపి గవర్నరుకు మెమొరాండములు సమర్పించారు. జంటనగరాలలో తీవ్ర వేసవి పరిస్థితులు ఏర్పడినపుడు మంచి నీటికొరత గూర్చి ప్రభుత్వానికి సూచించి తగిన చర్యలు తీసుకో మన్నారు, నిరుద్యోగుల సమస్యలు పరిష్కరించడానికి చర్చలు సమావేశాలు జరిపినది, రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో పేదలకు భూములు పట్టాలు దొరకని సంఘటనలను శ్రీ పోతుకూచి ప్రభుత్వం దృష్టికి తీసుకు వస్తూ రెవెన్యూ మంత్రికి ప్రధాన కార్యదర్శికి వారి సమస్యలు పరిష్కరించమని విజ్ఞప్తి చేసినారు.

చైతన్యసేన మేడే ఉత్సవాలను నిర్వహించి కార్మికులకు సన్మానం చేసింది. వరద బాధితుల కోసం పని చేసింది. హోటల్ రేట్ల విషయంలో హోటల్ యాజమాన్యాన్ని ప్రజలను ఉమ్మడిగా ఒక్క వేదిక మీద అనుసంధానం చేసింది. సమావేశాల నేర్పాటు చేసింది. ఇది ఎవరి సమస్య ఎక్కడి సమస్య అని సునిశితంగా పరిశీలించి దానికి తగ్గ కార్యక్రమాల నేర్పరచి ప్రజలలో ఒక సదవగాహనకు ప్రయత్నిస్తుంది. నిశ్చయముగ నిర్భయముగ తన కార్యక్రమం చివరివరకు అవిశ్రాంతంగా ఆలోచిస్తుంది. అమలు పరుస్తుంది చైతన్యసేన.

'వివాహ వేదిక' నేర్పరచి అన్ని కులాల అవివాహిత యువతీ యువకులు తమ వివరాలు ఫోటోలతో సహా రిజిస్టరు చేసుకునే అవకాశం కల్పించింది.

'ఉద్యోగ వేదిక' నేర్పరచి పేదవారికి ప్రాముఖ్యత నిస్తూ యువతీ యువకులు తమ ఉద్యోగాల కోసమై రిజిస్టరు చేసుకునే అవకాశం కనిపించింది

ఈ ప్రజాసేవా కార్యక్రమంలో ఈ సాంఘిక సంక్షేమ కార్యక్రమంలో పోతుకూచి సాంబశివరావు గారి బహుముఖ ప్రజ్ఞ కొనియాడదగినది. తన ఉన్నతమైన ఆలోచనతో దానికి తగిన కార్యాచరణతో వారు ముందుకు అడుగు వేస్తారు అడుగంటా చూస్తారు. ప్రజలను వెన్నంటి ఉంటారు. వారి తలుపు తడతారు. ఇది సమస్య. జన సమస్య. దీనికి ఈ సమాధానం ఇలా ఉండాలి దీనికి ఈ పరిష్కారం ఇలా ఉండాలి అని నిర్దేశించరు. సమిష్టి ఆలోచనకు ప్రాధాన్య మిస్తారు. దానికి తగ్గ కార్యాచరణ చూపడంలో మేధస్సును చూపిస్తారు. ప్రతిభను చూపిస్తారు. అది ప్రజలకు వరమై భాసిస్తుంది. వారధిలా నిలుస్తుంది.

మన జీవితమే ఒక సమస్యల వలయం. ఏ సమస్యను ఎలా విడదీస్తే ఆ సమస్యలు పటాపంచ లవుతాయో చైతన్యసేనకు తెలుసు. పోతుకూచి సాంబశివరావు గారికి తెలుసు. ఏ సమస్యనైనా ఛేదించడానికి వారు అగ్రభాగంలో ఉంటారు. అందుకే వారి నాయకత్వం చైతన్యసేనకు పెట్టని కోట.



సెన్సారు బోర్డు సభ్యుడుగా శ్రీ పోతుకూచి

సెన్సారు బోర్డు సభ్యునిగా శ్రీ పోతుకూచి సాంబశివరావును ఎన్నిక చేయడం నిజంగా గర్వకారణమైన విషయం. వారి నిఖార్సయిన వ్యక్తిగతం ఎంతో చక్కని అవకాశం కల్పించింది.

కేంద్ర మానవ వనరుల అభివృద్ధిశాఖ అధ్వర్యంలో ఈ ప్రాంతీయ సెన్సారు బోర్డు హైదరాబాదులో ఏర్పాటు చేయబడింది.

కొన్నేళ్ళపాటు కేంద్ర సమాచార ప్రసారశాఖతో జరిపిన పోరాట ఫలితంగా 1984 లో హైదరాబాదులో సెన్సారు కార్యాలయం ప్రారంభించేందుకు ఆమోదం లభించింది. హైదరాబాదులో ప్రాంతీయ సెన్సారు కార్యాలయం పని ప్రారంభిస్తే తెలుగు భాష తెలియని మేధావులబారినుంచి తెలుగు చిత్రాలకు అర్థం పర్థం లేని కత్తిరింపులు తగ్గుతాయి. పైగా రాష్ట్రంలో నిర్మించే తెలుగు హిందీ భాషల కథాచిత్రాలను, డాక్యుమెంటరీ చిత్రాలను సెన్సారు చేసే సౌకర్యం లభిస్తుంది.

తెలుగు చిత్రాలకు సర్టిఫికెట్ ఇచ్చే ప్యానెల్‌లో శ్రీ సాంబశివరావు

సభ్యులుగా ఉన్నారు. ఈ ప్యానెల్ మొట్టమొదటగా 'రాక్షసుడు' చిత్రానికి సర్టిఫికెట్ ఇచ్చింది.

శ్రీ సా. బశివరావు గారి ఎన్నిక విజ్ఞులయిన ప్రతిఒక్కరికి ఎంతో గర్వ కారణం. మంచిని కాంక్షించే ప్రతివారికి ఒక ఆకాంక్షణం.

# 3

## వివిధ భారతీయ భాషా సంస్థలతో శ్రీ పోతుకూచి

తన పరిధిని కేవలం తెలుగు భాషకే పరిమితం చేసుకోకుండా, తన భాషను దేశంలోని ఇతర ప్రాంతాలలో వివిధ వర్గాలలో ఎలుగెత్తి చాటారు. తెలియజెప్పారు.

బరోడాలో జరిగిన అఖిల భారతీయ రచయితల సమావేశంలో (1959) శ్రీపోతుకూచి పాల్గొన్నారు. ఆ సందర్భంలో వీరు పండిత జవహర్‌లాల్ నెహ్రూ, డా॥ రాధాకృష్ణన్ ప్రభృతులకు పరిచయం చేయబడ్డారు.

మద్రాసులో UNESCO వారు ఏర్పాటు చేసిన సదస్సులో (1961) చాలమంది రచయితలు దక్షిణ భారతావని నుండి హాజరయినారు. వారిలో శ్రీ పోతుకూచి ఒకరు.

అంతేకాదు వివిధ సందర్భాలలో ప్రత్యేక ఆహ్వానితునిగా ఆల్ ఇండియా PEN కాన్ఫరెన్సుల లోను, ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సుల లోను, UNESCO సెమినార్లలోను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పాటు చేసిన వివిధ సెమినార్లలోను పాల్గొన్నారు.

అఖిల భారతీయ భాషా సాహిత్య సమ్మేళన్ రెండు రోజులు (1985) హైదరాబాదులో జాతీయ స్థాయిలో రచయితల సభలు జరిగాయి శ్రీ పోతుకూచి స్వాగతం చెబుతూ జాతీయ స్థాయిలో రచయితల సభలు చాలా అవసరమనీ, ఇవి జాతీయ సమైక్యతకు దోహదం చేస్తాయని, బహు భాషా పాండిత్యం రచయితలకు పెన్నిధి కాగలదని, జాతీయ సమైక్యత మన సంస్కృతి పునాది వంటిదని పేర్కొన్నారు

జాతీయస్థాయిలో రచయితలతో సంబంధాలు పెంచుకున్న సంస్థలు బహు కొద్ది. అందులో మన 'విశ్వసాహితి' (హైదరాబాదు) ఒకటి

ఉత్తరాల ద్వారా, వివిధ భాషా సమావేశాల ద్వారా తనకు, తన ప్రజలకు ఒక గుర్తింపు కోసం పాటుపడే మనిషి మన సాంబశివరావుగారు అహరహం ఆలోచించే చురుకైన మనిషి మన పోతుకూచి వారు. అందుకే వివిధ భారతీయ భాషా సంస్థల సమావేశాలలో పాల్గొంటూ తెలుగు సాహిత్యంలోని మాధుర్యాన్ని, తెలుగు సంస్కృతి యొక్క ఔన్నత్యాన్ని ఉగ్గడిస్తున్నారు.

# 32

## జర్నలిస్టుగా శ్రీ పోతుకూచి

జర్నలిజానికి ఒక విశిష్టతను తీసుకు వచ్చి మెరుగులు దిద్దిన మేధావుల్లో ఒకరు మన పోతుకూచి సాంబశివ రావుగారు. పత్రికారంగంలో వారు నేర్చుకున్నది నలుగురికి పంచిపెట్టడమేకాదు. ఆ నలుగురిని తనంతటి వారుగా తీర్చిదిద్దే నేర్పు ప్రతిభ వారిలో ఉన్నాయి. ఎంతోమంది ఎన్నో విధాలుగా వారినుంచి ఎంతో నేర్చుకొని ఈ రోజున పత్రికారంగంలో పేరు తెచ్చుకున్నారు. జర్నలిజంతో పెనవేసుకు పోయిన జీవితంలోని సాహిత్య పిపాసకు మరోపేరు మారుపేరు మన సాంబశివరావుగారు. తానే ఒక ఉద్యమమై ప్రజలను సమీకరించి పోరాడటం వీరు ఎన్నుకున్న మార్గం. జనజీవితంతో కలిసి నడుస్తూ జర్నలిజంలో తన ప్రతిభను తన ప్రత్యేక తను నిలుపుకుంటూ సరికొత్త గొంతుతో నినదించే అక్షరవిన్యాసం వీరి అభ్యుదయానికి మార్గదర్శకమయినది.

వివిధ పత్రికల ప్రచురణలతో ఆయా రంగాలలో విస్తృతమయిన సేవలు చేయడం అభినందనీయమైన విషయం. ప్రజలకు వార్తలందించ డంతోపాటు విజ్ఞానవంతులుగా తీర్చిదిద్దే సాధనం పత్రిక. శ్రీ పోతుకూచి

వారు ఈ రంగంలో చేపట్టిన కార్యక్రమాలు ఎన్నో ప్రశంసలు అందు కున్నవి.

నవ్యసాహితి సమితి ప్రారంభంనుండి సంస్థ సమాచార పత్రికగా తీర్చిదిద్దిన 'నవ్య వాణి' సమిష్టి ప్రతిభకు ఆలోచనా శక్తికి ఒక ఉదా హరణగా సాహితీ ప్రియులమధ్య సాహిత్య సంస్థల మధ్య నిలిచిపోయింది.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ ఆధ్వర్యంలో ప్రచురించిన 'నాట్యకళ' పత్రికలో సహాయసంపాదకుడిగా పనిచేసి సాంస్కృతిక రంగాల అభివృద్ధికి ఎంతో పాటుబడ్డారు.

మన విశ్వసాహితి ఆధ్వర్యంలో ప్రచురిస్తున్న 'విశ్వరచన' పక్ష పత్రిక వారి ఆదర్శాలకు వారి నమ్మకాలకు కొత్తదనంకు ఒక ప్రతీకగా ఉంది. ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. మొదట మాసపత్రికగా ప్రారంభమయి ఇప్పుడు పక్షపత్రికగా వెలువడుతున్నది.

ఎందరో రచయితలు కళాకారులు తమ చేయూతను సహకారాన్ని అందజేస్తున్నారు వ్యాపారసంస్థలు ప్రకటనలనందజేస్తూ బలపరుస్తున్నారు. పత్రికలో వస్తున్న సంపాదకీయాలలో మన సాంబశివరావుగారి ప్రతిభ వెల్లడవుతుంది. అంతేగాక ఎన్నో వింతలు విశేషాలు విచిత్రాలు ప్రత్యేక శీర్షికలతో ప్రచురింపబడి ఆకర్షితము లవుతున్నాయి. గ్రంథ సమీక్షలు శీర్షికలో వివిధ గ్రంథాలపై వ్యాఖ్యానాలు పత్రికకి గొప్పదనాన్ని ఆపాదిస్తున్నాయి. అలాగే చిత్రరచన శీర్షికలో చలనచిత్రాలపై సమీక్షలు ఎంతో భావభరితంగా ఉంటున్నాయి. పాఠకుల అభిప్రాయాలను ప్రతి బింబించేందుకు ఉత్తరాల శీర్షిక ఎంతో ఉన్నతంగా ఉంది. ప్రశ్నలు సమా

ధానాల శీర్షికలో ఎంతో మందిపెద్దలచే పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇప్పించారు. వ్యాఖ్యల పోటీలు 20పంక్తుల కవితంతో పోటీలను ఏర్పర చడం బహుమతులనివ్వడం కొత్తతరం రచయితలకు ఉత్సాహపూరితమైన విషయం. అలాగే వ్యాసపరంపర నిత్యజీవిత సమస్యలకు రచయితలమేధా పటిమకు తార్కాణం ప్రస్తుత రాజకీయ సమస్యపై వ్యాసాలు, నేనే న్యాయమూర్తినయితే? (విడాకుల సమస్యలపై నాతీర్పు) ఇలా ఎన్నోవిష యాలు రచయితలను ఆకట్టుకుంటున్నాయి. సాహితీ సమస్యలను పూరిం చడం మరెన్నో కథలు కవితల పోటీలు నిర్వహించడం జరుగుతున్నది. విదేశాల్లోని తెలుగు వారికి కూడా ప్రతులు అందజేయడం జరుగుతున్నది అందరి సహకారం చేయూత ఉండాలనే పత్రిక ఆశిస్తున్నది.

మన విశ్వసాహితి ఆధ్వర్యంలోనే 'విశ్వరచన' దినపత్రిక 1978 నుండి వెలువడుతున్నది, ప్రతి సాయంత్రం వెలువడుతున్నది. జంటనగ రాల్లో వివిధ ప్రాంతాల్లో ఎక్కువ ప్రచారంలో ఉన్నా రాష్ట్ర వివిధ ప్రాంతాల్లో కూడా పాఠకులకు బాగా పరిచయం అయింది. వార్తలు వ్యాఖ్యలు సమీక్షలే కాకుండా 'కవితా-కాలం' శీర్షిక 1985లో ఏర్పాటు చేయడం అనేకానేకమంది కవులకు వారి రచనలకు ప్రాచుర్యం ఏర్పడింది. ఈపత్రికా నిర్వహణలో వివిధ కార్యకర్తల సహకారం ప్రశంసనీయం. ముఖ్యంగా న్యాయవాదులు కోర్టులు, న్యాయ మూర్తులు ప్రకటనలు ఇచ్చి పత్రికల అభివృద్ధికి ఎంతగానో తోడ్పడు తున్నారు.

సంస్థ తరపున ఆంగ్ల పత్రిక 'UNILIT' ప్రచురించడం జరుగు తున్నది. ఈ పత్రిక భారతదేశం లోనే కాకుండా విదేశాలలో కూడా

బహుళ ప్రచారం పొందింది అనేకమంది సభ్యులుగా ఉన్నారు. తెలుగు సాహిత్యాన్ని ఇతర భాషల వారికి అందించడానికి బహుముఖంగా కృషి చేస్తున్నది. మొదట త్రైమాస పత్రికగా వెలువడిన UNILIT ప్రస్తుతం మాసపత్రికగా ప్రచురితమవుతున్నది.

తెలుగు జన జీవితంలో మహోన్నత వ్యక్తులయిన గురజాడ పానుగంటి జీవితం వారి రచనల విశ్లేషణలతో ఇతర భాషల వారి కోసం ప్రత్యేక సంచికలు వెలువరించడం జరిగింది.

UNILIT ప్రచురించిన 'గురజాడ' ప్రత్యేక సంచిక విడుదల సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ నగేష్, అప్పటి విద్యాశాఖా మంత్రి శ్రీ పి.వి.జి.రాజు పాల్గొన్నారు. యూనిలిట్ ప్రచురించిన 'పానుగంటి' ప్రత్యేక సంచిక విడుదల సందర్భంలో అప్పటి విద్యా శాఖామంత్రి శ్రీ పి వి. నరసింహారావు పాల్గొన్నారు. విశ్వసాహితి తన యూనిలిట్ ప్రచురణల ద్వారా అందించిన ఈ ఆంగ్ల సంచికలు ఎంతో ఉపయోగకరమైనవి. తెలుగు మహనీయుల గురించి ప్రపంచానికి తెలియజేసిన శ్రీ సాంబశివరావును తెలుగు ప్రజ ఎంతో గొప్పగా చెప్పుకుంటి. దశమ వార్షికోత్సవాల (1970) యూనిలిట్ ప్రత్యేక సంచిక సాహితీ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం.

పత్రికలను నెలకొల్పి పచ్చని ఆశలను పాదుకొల్పి ఉత్తమ జర్నలిస్టుగా పేరు పొందారు, అంతేకాదు ప్రజలు వాస్తవాలను తెలుసుకునేందుకు వీలుగా వార్తలను ఏ మాత్రం వక్రీకరించకుండా ప్రచురించే సత్సంప్రదాయం వారిది. జర్నలిజం అనేక వత్తిడులకు ప్రలోభాలకు గురి అవుతున్న ఈ రోజుల్లో తన ధర్మాన్ని సక్రమపంథాలో నిర్వర్తిస్తున్నందుకు

వారిని శతధా అభినందించాలి. అనేక ఒడిదుడుకుల నెదుర్కొని ప్రజల అభిమానం పొందడం అది ఎంత కష్టతరితమైన పని అయినప్పటికి నిర్వహించు శక్తి సామర్థ్యాలు కలిగి ఉండటం చెప్పుకోదగిన విషయం. జర్నలిజంలో ఉన్నత సంప్రదాయాలను, ఉత్తమ విలువలను అనుసరించడం తనదంటూ ఒక ప్రత్యేకశైలిని కలిగి ఉండటం వారిలో ఒక ప్రత్యేకతగా పేర్కొంటారు.

ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించడంలోను, సామాన్య ప్రజల సమస్యలను ప్రభుత్వ దృష్టికి తేవడంలోను ముందడుగు వేసిన వ్యక్తిగా ప్రజాదరణ లభించిన వ్యక్తిగా శ్రీ సాంబశివరావును చెప్పుకోవాలి. ఎంతో ప్రగతి సాధించి వైవిధ్యము కలిగి పాఠకుల మనసులలో ఒక విశిష్ట స్థానము సంపాదించుకున్నారు.

ఎన్నో కాల పరీక్షలకు తట్టుకొని, నిలబడి మారుతున్న, ఎదుగుతున్న మన సమాజానికి మార్గదర్శకత్వం వహిస్తున్నారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలను జాగరూకం చేయవలసిన బాధ్యత, ప్రజలకు ప్రభుత్వానికి వారధిలా ఉండవలసిన బాధ్యతగురించి జర్నలిజంలో ఉత్కృష్ట ప్రమాణాలను పాటిస్తున్నారు.

సామాజిక రుగ్మతలను ఎండగట్టి పరిష్కారాలను సూచించడంతో వీరు నిర్వహించిన పాత్ర కీలకమైనది. వార్తలను విమర్శనాత్మకంగా నిష్పక్షపాతంగా విశ్లేషించడంలో తమదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్నారు.

ఆయా సమస్యలపై ఎవరి స్వంత అభిప్రాయాలు ఎలా ఉన్నా

జర్నలిజం నైతిక ప్రమాణాలను కాపాడటంలో వీరి పాత్ర గణనీయమైనది. సమస్యలకు అద్దం పట్టి ప్రజాభిప్రాయాన్ని సరైన విధంగా మలచడంలో వీరు ప్రశంశనీయమైన పాత్ర నిర్వహించారు. వాస్తవాలకు దూరమైన కృత్రిమ సంచలన వార్తలకు చోటు లేకుండా నిగ్రహానికి, నిష్పాక్షికతకు పెట్టింది పేరు వీరు. జనం పెట్టుకున్న ఆశయాలకు విశ్వాసాలకు ప్రతిబింబం వీరు. ప్రజాబాహుళ్యంలో మన్ననలను పొందిన విషయం సర్వవిదితమే

అటు రాజకీయ రంగానికే కాకుండా ఇటు చలనచిత్రరంగ వార్తలకు ఎంతో ప్రోత్సాహమిచ్చారు. వ్యాఖ్యలను పెంచారు, 'తమ అంతరంగ మథనానికి అక్షరరూపం ఇస్తూ వ్రాస్తున్న యువత అభిరుచులను ప్రతి పేజీలోను పొందుపరుస్తూ చేసే ప్రతి ప్రయోగం ఎంతో విజయవంతమవుతున్నది.



జర్నలిస్టుగా మన సాంబశివరావు గారు ఉన్నత మేధావి వర్గానికి చెందినవారు. వారు వ్రాసే ఏ వ్యాఖ్య అయినా కలకాలం ఉండే మాట నిజం.



అందుకే వారు నిజమైన జర్నలిస్టు

# 33

## ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్న పత్రికల సంఘ నిర్వహణలో శ్రీ పోతుకూచి

శ్రీ పోతుకూచి సాంబశివరావు గారి మణి కిరీటములో మరొక కలికి తురాయి ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్న పత్రికల సంఘ సారధ్యం. ఎవరికి వారుగా చెల్లాచెదురుగా వివిధ జిల్లాల మారుమూల గ్రామాలలో ఉన్న అనేక దిన వార పక్ష మాస పత్రికలను ఒక గొడుగు కిందకు తీసుకువచ్చి వారి సమస్యలను కలిసి ఎదుర్కొంటూ, ఉమ్మడిగా పరిష్కారానికై ప్రయత్నం చేస్తూ తన సారధ్యాన్ని కృష్ణ సారధ్యమని నిరూపించుకున్నారు.

ఉత్తమ సంప్రదాయాలను ఉత్తమ విలువలను జర్నలిజంలో పరిరక్షించడం, వివిధ పత్రికల మధ్య సత్సంబంధాలను ఏర్పరచడం, ప్రజల ఆశలకు రూపకల్పన చేయడం, పత్రికా ప్రచురణల స్వేచ్ఛను పరిరక్షించడం, పత్రికలలో పని చేస్తున్న ప్రతి ఒక్కరి హక్కులను, అవకాశాలకు అండగా నిలవడం చిన్న పత్రికల వారి కోసం ప్రత్యేకంగా ఒక 'న్యూస్ ఏజన్సీ' ని ఏర్పాటు చేయడం ఇలా ఎన్నో ఆశయాలకు కలసికట్టుగా ఒక్కటిగా ఏర్పడింది ఆంధ్రప్రదేశ్ తెలుగు చిన్న పత్రికం

సంఘం. శ్రీ సాంబశివరావు గారు సంఘ అధ్యక్ష పదవిలో ఉంటూ సంఘ ఆశయాలకు, సమస్యలకు ఒక దర్పణంగా అండదండగ ఉన్నారు.

చిన్న పత్రికల సంపాదకులకు ఎక్కడ ఎలాంటి అన్యాయం జరిగినా ఆ వ్యక్తి సంఘానికి తెలియజేసినపుడు ఆ వార్తను అన్ని చిన్న పత్రికలు పతాక శీర్షికలతో ప్రచురించడం. చిన్న పత్రికల సంపాదకులకు రాష్ట్ర వ్యాపితంగా ఉచిత బస్‌పాస్ సౌకర్యం కల్పించేందుకు తగు చర్యలు చేపట్టడం, రాష్ట్రంలోని చిన్న పత్రికల అన్నింటికి న్యూస్‌ప్రింటు సరఫరా సక్రమంగా అందునట్లు ప్రభుత్వాన్ని కోరడం.

ప్రస్తుత ప్రభుత్వం ఇస్తున్న ప్రకటనల కాలం సెంటిమీటరు రేటును పెంచాలని ప్రభుత్వాన్ని కోరడం; సంకుచిత స్వార్థ ప్రయోజనాల కోసం చిన్న పత్రికల వారి ఐక్యతను దెబ్బదీసేవారిని ఒక కంట కనిపెట్టి ఉండి అటువంటి వారిపై తగు క్రమశిక్షణ చర్యలు తీసుకోవడం

ఎన్నో ఆశయాలు ఎన్నో సమస్యలు వీటిని సవివరంగా శ్రీకాకుళం, హైదరాబాదు సూర్యాపేట, తిరుపతి మొదలగు ఎన్నో ప్రాంతాలలో సభలు ఏర్పాటు చేయడం, తమ సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకు రావడం. ఇలా ఎన్నో.

పరిణత దృష్టితో, పరిశీలనాసక్తితో శ్రీ సాంబశివరావు గారు విభిన్న వ్యక్తిత్వాలను నింపుకున్న వివిధ పత్రికలను సమన్వయం చేస్తూ ప్రజాసేవ పత్రికా సేవలు చేస్తున్నారు.

అంతేకాదు చిన్న పత్రికల సంఘం ప్రతి యేడాది ఉత్తమ దిన వార పక్ష పత్రికలకు బహుమతుల నందజేయడం ప్రతి పత్రిక అన్ని

సంచికలు వెలువడడానికి, సర్వాంగ సుందరంగా ప్రచురించడానికి అవకాశము కల్గించింది.

తెలుగు చిన్న పత్రికల సంఘ నిర్వహణలో వాటి పురోభివృద్ధికి వారి సమస్యల పరిష్కారానికి చేయూత నిస్తూ అండదండా కల్పిస్తూ ఏకోన్ముఖంగా కలసికట్టుగా నడవడానికి ఎన్నో అవకాశాలు కల్పిస్తూ ప్రాంతీయంగా సభలు సమావేశాలు తరచూ జరుపుతూ చైతన్యం కలిగిస్తున్నారు మన సాంబశివరావు గారు.

3.

## సాహిత్య పోరాటంలో శ్రీ పోతుకూచి

కుమారి వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'మరీచిక' నవలపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫిబ్రవరి 6,1982న నిషేధించింది.

ఈ వార్త రచయితలలోను, సాహిత్యాభిమానులలోను ఎంతో కలవరాన్ని రేకెత్తించింది. నిరసన సభల్లో ప్రముఖు లెందరో ప్రభుత్వ చర్యను తీవ్రంగా గర్హించారు. అనేకమంది రచయితలు పత్రికలలో విమర్శించారు, పత్రికా ప్రకటనలతో హోరెత్తించారు,

శ్రీ సాంబశివరావుగారు తమ సంపాదకీయంలో ఇలా అన్నారు.

ఈ నవల 1979 లో సీరియల్‌గా ఆంధ్రభూమి వారపత్రికలో ప్రచురింపబడింది. అనేక వందల మంది గ్రంథాలయాల్లో చదివారు, కానీ ప్రభుత్వం 1992 లో నవలపై నిషేధం విధించింది. ఇంత కాలయాపన తరువాత రాష్ట్ర ప్రభుత్వం మేలుకొని నిషేధం విధించడం విచిత్రం, విడ్డూరం. అయితే సాహిత్యంలో నిషేధించవలసిన గ్రంథాలు ఎన్నో ఉన్నాయి సమాజప్రగతిని కుంటుపరచే ఛాందస లైంగిక క్రీడల, అప రాధ పరిశోధక గ్రంథాలు ఎన్నో బహిష్కరించవలసిన అగత్యం ఉంది.

రాష్ట్ర ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఈ నవల వ్రాయబడిం దని అనడానికి పోలీసులు ఒక్కరే చాలరు సాహిత్య అకాడమీ, సాహిత్య వేత్తల అభిప్రాయాలను రాష్ట్రప్రభుత్వం సేకరించి నిర్ణయం తీసుకో వల్సింది. కానీ అలా జరగలేదు. నిషేధం నిర్దాక్షిణ్యంగా, నిరంకుశంగా తీసుకోవడం జరిగిందని ప్రముఖులు పత్రికలు పేర్కొన్నారు.

విశ్వసాహితి అధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీమతి మల్లాది సుబ్బమ్మ శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం, అఖిల భారత ప్రజా స్వామ్య న్యాయవాదుల సంఘం అధ్యక్షులు శ్రీ పత్తిపాటి వెంకటేశ్వర్లు, ఒక డెలిగేషనుగా అప్పటి హోంమంత్రి, ఉప ముఖ్యమంత్రి శ్రీ జగన్నాధ రావును కలుసుకొని ఈ నిషేధం తొలగించమని విజ్ఞప్తి చేశారు. హోం మంత్రి ఈ విషయం పునఃపరిశీలిస్తామని అన్నారు.

శ్రీ పోతుకూచి వారు తమ విశ్వరచన డైరీలో సంపాదకీయం వ్రాస్తూ ఇంకా ఇలా అన్నారు ఇంతకు పూర్వం మాలపల్లి నవలను అప్పటి బ్రిటిష్ దురహంకారం నిషేధించింది. నక్సలైట్ సిద్ధాంతాలు ప్రచ

చించే వారి గ్రంథాలు, పత్రిక 'సృజన' ఒకప్పుడు నిషేధించబడ్డాయి. అయితే ప్రజల, రచయితల ప్రాథమిక హక్కులయిన స్వతంత్ర్యం, భావ స్వాతంత్ర్యం ఈ నిషేధం వల్ల ఎంతవరకు అమలు జరుగుతోంది అని ప్రజలు ప్రభుత్వం కూడా ఒకసారి పునరాలోచన చేసుకోవాలి, ముఖ్యంగా ఈ ప్రగతి మార్గ ప్రజాసౌమ్య రాజ్యంలో.

అంతేకాదు 'మరీచిక'నవలపై నిషేధాన్ని ఎత్తివేయాలని సుల్తాను బజారులోని శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంలో జరిగిన సభలో పలువురు కవులు, రచయిత(త్రు)లు రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

మరీచిక నిషేధాన్ని రచయిత్రి స్వంత సమస్యగా కాక అందరి బాధ్యతగా భావించి నిషేధాన్ని ఖండించడమే గాక సభలు సమావేశాల ఏర్పాటులో గానివ్వండి, ప్రభుత్వందగ్గరకు డెలిగేషను తీసుకువెళ్ళడంలో గానివ్వండి, న్యాయం కోసం కోర్టు గేట్లు తెరిపించడంలో గానివ్వండి నిషేధం తొలగించే వరకు అవిశ్రాంతంగా పోరాటం సలిపిన సాహితీ వీర యోధుడు మన పోతుకూచి సాంబశివరావు గారు.

చివరకు 'మరీచిక' నవలపై నిషేధాన్ని ప్రభుత్వం తొలగించింది.

# 35

## జంటనగరాల సాంస్కృతిక రంగంలో శ్రీ పోతుకూచి

శ్రీ పోతుకూచి సాంబశివరావుకు జంటనగరాలకు అవినాభావ సంబంధ మున్నది. ప్రధానంగా జంటనగరాలలో సాహిత్య సాంస్కృతిక రంగాలలో వారి స్థానం ప్రత్యేకమైనది. ఉన్నత మైనది. 1952 లో నవ్య సాహితి సమితి హైదరాబాదులో మొదలయి నప్పటి నుండి వారి సాహిత్య కార్యకలాపాలకు ఒక ప్రాతిపదిక ఏర్పడింది.

1960 లో ఎన్నో ప్రయాసలు పడి ఎన్నో ఇక్కట్ల కోర్చి అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు హైదరాబాదులో ఏర్పాటు చేయడం, ఆ మహాసభల తీర్మాన ఫలితంగా తెలుగు సాహితీ సంస్కృతులను విశ్వవ్యాప్తం చేయడానికి ఒక 'విశ్వసాహితి' సంస్థను హైదరాబాదులో నెలకొల్పడం జరిగింది శ్రీ అక్కిరాజు వేంకట జనార్ధన రావు, కుమారి M. L. శేషాబాయి మొదలగు ఉద్దండులు శ్రీ పోతుకూచికి చేయూతనిచ్చారు. సహకార మిచ్చారు.

అఖిల భారత తెలుగు రచయితల సభల నుంచి సాంస్కృతిక సంస్థగా నవ్యసాహితీ సమితి అనుబంధ సంస్థగా 'నవ్యనాటక సమితి' ఏర్పడింది. ఈ పాతికేళ్ళలో ఎన్నో అఖిల భారత సంగీత నృత్య పోటీ

లను ఏర్పాటు చేసిన ఘనత నవ్య నాటక సమితిది. ఈనాటి వరకు నవ్య సాహితీ సమితి, నవ్య నాటక సమితి కార్యక్రమాలలో ఒక కార్య కర్తగా పాల్గొంటూనే ఉన్నారు.

రెండవది పోతుకూచి ట్రూప్. ఎన్నో నాటికలు హరికథలుసంగీత కార్యక్రమాలు నృత్య కార్యక్రమాలు ఎన్నో ఈ సంస్థ తరపున ఏర్పాటు చేశారు.

ఇండియన్ నేషనల్ థియేటరు ఆధ్వర్యంలో జరుగుతున్న 'నవ్వండి-నవ్వించండి' కార్యక్రమాలకు సమావేశకర్తగా పాల్గొంటూ శ్రీ పోతుకూచి, ఇలాంటి కార్యక్రమాలు ప్రతినెలా జరగవలసిన అవసరం చాలా ఉందని అన్నారు.

జంటనగరాల మధ్యనున్న సుల్తాన్‌బజారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయంకు 1961-62 లో కార్యదర్శిగా ఉండి దాని వజ్రోత్సవా లను విజయవంతంగా నిర్వహించారు. ఈ నాటికీ విశ్వసాహితి కార్యక్రమా లకు ఈ గ్రంథాలయం ఎంతో అండగా ఉంది. అక్కడ వారు ఏర్పాటు చేసే సదస్సులు కార్యక్రమాలు కిక్కిరిసిన జనసందోహంతో కిటకిట లాడేవి.

1965 లో హైదరాబాదులో ఆంధ్ర నాటక కళా పరిషత్తు ఉత్స వాలు శ్రీ పోతుకూచి ఆధ్వర్యంలో జరిగినవి.

హైదరాబాదు ఆంధ్ర మహిళా సభ సాహిత్య నిర్వాహక మండలి లో సభ్యులుగా చేశారు.

సాధన సమితి ఆధ్వర్యంలో వెంకట్ అవార్డు ప్రధానోత్సవ సభలో ముఖ్య అతిథిగా పాల్గొని కార్టూనిస్టులు గానీ, చిత్రకారులు గానీ తన చుట్టూ ఉన్న సమాజాన్ని దృష్టిలో ఉంచుకోవాలనీ, మాటలు లేకుండా అర్థమిచ్చే కార్టూనులను సృష్టించాలనీ అంతేకాదు వారికి కూడా ప్రత్యేకంగా శిక్షణా తరగతులను నిర్వహించాలనీ అన్నారు.

అంతేగాక నగరంలోని శ్రీనివాస సాహితి సమితి, సాధన సమితి, మానస ఆర్ట్ థియేటర్స్, సాధనా సాహితీ స్రవంతి, జాలీ ఫ్రెండ్స్ అసోసియేషను ఇలా ఎన్నో సాహితీ సంస్థలతో వారికి విశేష సంబంధాలు ఉన్నాయి

తెలుగు రచనలనేకాకుండా వివిధ భాషారచయితలను హైదరాబాదు తీసుకువచ్చి వారిని జంటనగరాల పెద్దలతో ఉపయోగకరమైన చర్చలను ఏర్పాటు చేసేవారు.

హైదరాబాదు వచ్చిన ఎందరో రచయితలకు ఎవరికీ తెలియకుండా బస్ ఛార్జీలు రైలు ఛార్జీలు ఇవ్వడం ఆ విధంగా సాహితీ పోషకుడిగా శ్రీ సాంబశివరావు సాహిత్యానికి ఎంతో సేవచేశారు.

వ్యక్తిలోని శక్తిని పసిగట్టి ఆ శక్తికి ఒక అవకాశం కల్పించి తానొక్కడైనా పెక్కురిని చేర్చి ఎక్కడైనా ఒక సాహిత్యోద్యమాన్ని సృష్టించగల ఒక మహాశక్తి, మహావ్యక్తి మన సాంబశివరావుగారు.

జంటనగరాలలో శ్రీ సాంబశివరావు ఏర్పాటు చేసిన సాహితీ వేదికలను అలంకరించని సాహిత్యకారులు, సాహిత్యాభిమానులు ఉండరనడంలో సందేహంలేదు. ఆయన కల్పించిన అవకాశాల ఆసరాతో లబ్ధప్రతిష్ఠులయిన

రచయితలు ఎందరో ఉన్నారు. సారస్వతరంగంలో ఉన్నతిని చేరుకోవడానికి శ్రీ పోతుకూచి ఇచ్చిన ప్రోత్సాహం ఎందరో యువతీయువకులకు సోపాన పంక్తులుగా తోడ్పడ్డాయి.

జంటనగరాలకు ఆయనకు ఉన్న సంబంధాలవలన ఎంతోమంది పెద్దలతో పరిచయం కలిగి, వారిని సభలు సమావేశాలకు పిలవడం జరిగేది ఆయనచుట్టూ ఎల్లప్పుడూ యువక సమూహం ఉంటూ ఉండేది. కారణం యువకుల్లో ఉత్సాహాన్ని పెంచేవారు. వారిలో నిబిడీకృతమైన ఆలోచనలకు ఒక అక్షరరూపం కల్పించేవారు. రాజకీయంగా కొంత వెనకపడ్డప్పటికీ వారిలోని సాహితీ సాంస్కృతిక భావనలు వన్నెతరగలేదు. గంధపుచెట్టువలె వాసనలు విరజిమ్ముతూనే ఉన్నాయి. అందరినీ ఉత్సాహపరుస్తూనే ఉన్నాయి. జంటనగరాలలో జరిగే అనేకానేక కవిసమ్మేళనాలలో పాల్గొంటూ జనతకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంటారు తమ అమోఘ కంఠస్వరంతో.

జంటనగరాల యువజనంలో ఒక ఆనందం ఒక ఆశాభావం వారిపట్ల ఉన్నవి. వారి సాంగత్యం వారికి హిమాలయాల ఉత్తుంగసదృశం. సాంబశివరావుగారి మనసు సాగరమంత గంభీరమే కాదు సాగరమంత చైతన్యవంతమైనది.

సభలు సమావేశాలు తను ఏర్పరచినా అంతేకాదు ఎవరు ఏర్పరచినా భేషజం లేకుండా అహంలేకుండా గర్వంలేకుండా హోదాలేకుండా సరియైన సమయంకంటే ముందుగావడం యువతకు చక్కని క్రమశిక్షణ నేర్పడమే. యువతతో కార్యకర్తలతో సాన్నిహిత్యం పెం పొందించుకొనుటకు ఆయన నేర్చుకున్న మంచి అలవాటు అది. అచంచలమైనది.

శ్రీ సాంబశివరావుతోగల ప్రేమ అభిమానం వాటికి తోడు పట్టుదల క్రమశిక్షణ ఉండటంవలన వారిని జంటనగరాల యువతకు పెద్దలకు దగ్గరకు చేర్చింది. వారితో నిత్యసంబంధాలు ఉండటం నిజంగా జంటనగరాల సాహిత్య సాంస్కృతిక ప్రేమికులకు ఒక పెద్ద వరం, అంతేకాదు వారికి కొండంత అండ.

# సాహితీ చైతన్యం వెల్లివిరిసిన రోజు

జనవరి 27

జనవరి 27 ఒక వ్యక్తి పుట్టినరోజు. కాదు. ఒక మహాశక్తి పుట్టినరోజు. త్రివిక్రమావతారందాల్చి ఢమరుకం మ్రోగించి గజ్జెకట్టి నర్తించిన నటరాజ మూర్తికి మారుపేరు.

ఆయన మన పోతుకూచి సాంబశివరావుగారు.

ఒక మనిషి పుడితే ఎలా పెరిగి పెద్దవాడవుతాడని తల్లి ఆలోచిస్తుంది. ఎంత పెద్దవుతాడని తండ్రి ఆలోచిస్తాడు. తప్పటడుగుల నుంచి వేలమైళ్ళు నడిచి ఎంత ఎదిగాడో కాలంచెబుతుంది. ప్రజలు చెబుతారు. తమతో నడచి తమకు నాయకత్వం వహించిన శ్రీ సాంబశివరావును చూచి గర్విస్తున్న జాతిమనది. అతిశయోక్తి కాని పచ్చినిజం. పొగడ్తకానిపొగడ పువ్వు ఇది.

తూర్పుగోదావరి జిల్లాలో అలమూరు గ్రామములో శ్రీ పోతుకూచి నరసింహమూర్తి శ్రీమతి సూరమ్మ దంపతులకు నలుగురి బిడ్డల్లో ద్వితీయుడుగా 1929లో పుట్టి అద్వితీయుడనిపించుకున్నాడు. చనిపోవలసిన వాడు బ్రతికితే ఏదో సాధించడానికే బ్రతికాడు అని అనుకోవడంసహజం. అంతే జరిగింది. మనకు సాంబశివరావు మిగిలారు. చిన్నతనంలోనే పితృ వియోగంతో అనాధ అయినా మేనమామ సహాయంతో కష్టనష్టాలకు ఎదురొడ్డి ముందుకు నడవడం మొదలుపెట్టాడు.

ప్రాథమిక విద్య కోటిపల్లి అలమూరు గ్రామములలోను, హైస్కూలు విద్య రామచంద్రపురంలోను తరువాత కాకినాడ పి.ఆర్. కాలేజీలో డిగ్రీ చదివారు. సంఘములో జరుగుతున్న అన్యాయములను ఎదుర్కోవాలనే సంకల్పముతో న్యాయశాస్త్రము చదవాలనే అభిలాష కలిగింది. తరువాత హైదరాబాదు విశ్వవిద్యాలయం నుండి 'లా' డిగ్రీ పొందారు.

పడిలేస్తూ సాగించే జీవితగమనం ఒక పోరాటం లాంటిదని ఆయన ఎదురయిన అనేక అనుభవాల ద్వారా తెలుసుకున్నారు. కొంత కాలం రాష్ట్ర ప్రభుత్వ కార్మికశాఖలో ఇనస్పెక్టరుగాను, కొంతకాలం మంత్రిగారి పర్సనల్ అసిస్టెంటుగాను పనిచేసినట్లు బహుకొద్దిమందికి మాత్రమే తెలుసు. చివరికి విసిగి విరమించుకొని 1964 నుండి న్యాయ వాదవృత్తిలోస్థిరపడ్డారు. అంతేకాదు కార్మికజనసముదాయకళ క్తికి అండగా ఉండి ఆ రంగంలో కాకలుదీరి 'బార్'లో మేరువంత పేరు సంపాదించుకున్నారు. 'హైదరాబాదు లేబర్ జర్నలు' పత్రిక ఏర్పాటు చేయడంలోనే వారి అణువణువున కార్మికరంగం నిండి వున్నదని తెలుస్తున్నది.

సాంబశివరావుగారి జీవితాన్ని పరిశీలిస్తే పరిశోధనచేస్తే దానిలోని వైచిత్రి గోచరమవుతుంది. అతని సాహితీ వ్యాసాంగంమీద అతని జీవిత ప్రభావం ఎంతో ఉన్నదనేది మనకు వెంటనే తెలిసిపోతుంది.

అప్పటికి శ్రీ సాంబశివరావు హైదరాబాదులో ఇంకా వేళ్ళు పాతుకు పోలేదు. గవర్నమెంటులో ఒక చిన్న ఉద్యోగం చేస్తూ సొంతవూరికి ఆయినవారికి దూరంగా ఒంటరిగా బ్రతకడం మొదలు పెట్టిన సాంబశివ రావుగారికి కాలేజీ చదువులనాటి సాహిత్య సేవచేయాలనే కోరిక కలగడం అసహజం కాదు. కొందరు మనుషులు తమ ఒంటరితనాన్ని బాధల్ని ఇత రులతో పంచుకోవడానికి ఇష్టపడరు. సాంబశివరావుగారు దానికి పూర్తిగా విరుద్ధం. అందువల్లే అతని ఆవేదన కానీ ఊహలు కానీ అతని రచనలలో ప్రస్ఫుటం కాకమానవు.

తోటివారి అభివృద్ధినిగురించి సంఘ్రశేయస్సును గురించి తపన పడటంగూడా ప్రతి ఒక్కరి విద్యుక్తధర్మమే కాగా, ఈ స్వభావాన్ని పుణికి పుచ్చుకున్న కొందరిలో శ్రీ పోతుకూచి సాంబశివరావు ఒకరు. ఈ జీవితాదర్శంపట్ల ఆయనకుగల లక్ష్యశుద్ధిని 'సంసార బంధనాలకు బందీ' కాని ఆయన జీవితమే స్పష్టంగా చాటుతున్నదని నిస్సందేహంగా చెప్ప వచ్చు.

శ్రీ పోతుకూచి ఒక సంస్థ. అతని నిఘంటువులో విశ్రాంతి అనే పదం లేదు. అతనికి కాలం కేటాయించిన 24 గంటల్లో ఏరోజూ అతను క్రమంతప్పిన మాటలేదు. అనుకున్న పని అనుకున్న స్థాయిని మించి నిర్వహించడమేతప్ప వేరొకటి ఎరుగని శ్రీ పోతుకూచి సాహిత్య సేవలో అతని కృషి, నైశిత్యం తెలుస్తుంది.

శ్రీ సాంబశివరావు వ్యక్తిత్వం కనిపించటానికి, ఆయనకు పేరు ప్రతిష్ఠలు రావడానికి ఆయన శక్తిసామర్థ్యాలు ఎంతటి ప్రముఖ పాత్ర వహిస్తున్నవో, ఆయన స్వభావం ఆయన గుణగణాలు అంతే ప్రధాన పాత్ర నిర్వహిస్తున్నాయి. ఆయన సహృదయుడు, సౌమ్యుడు, స్నేహశీలి, ఆర్ద్రహృదయుడు అన్నింటికి మించి అజాతశత్రువు.

శ్రీ పోతుకూచి పేర్కొన్నట్లు జీవితంలో వ్యక్తికివివిధ రంగాలలో ప్రవేశం, అనేక వ్యక్తులతో పరిచయం అనేక సంఘర్షణలలో భాగ స్వామిగా ఉండడం అనేక ఉద్యమాలతో పరిచయం ఏర్పడడం ఆ వ్యక్తి జీవితానికి పరిపుష్టత ఇస్తుంది.

సాహిత్యం నాటకమే కాదు జ్యోతిషం హస్తసాముద్రికం వీటిలో గూడా వారు పేరుపొందారు. భవిష్యద్దర్శనా కేంద్రం అధ్యక్షులుగా శ్రీ పోతుకూచి ప్రతిభ సగర్వంగా చెప్పుకోదగ్గవిషయం. మీ భవిష్యత్తు గురించి సంప్రదించండి అంటూ హస్తరేఖలను పరిశీలించడం, 5 సంవత్సరముల జీవితరచనను, పూర్తిజీవిత రచనను చెప్పడం సాంవత్సరిక ఫలితాలను యేటేటా ప్రచురించడం శ్రీ పోతుకూచి విశేష పరిశీలనా శక్తికి పరిశోధనాసక్తికి ప్రతిభకు జ్యోతిష నీరాంజనాలందించవచ్చు. అంతేకాదు సాహితీ విద్యాలయలో వీటిగురించి వివరంగా యువతకు శిక్షణా కోర్సులు ఏర్పాటుచేయడం వారిముందు చూపుకు వారి విశాల హృదయానికి ఒక గొప్ప తార్కాణంగా భావించవచ్చు. అంతేకాదు జ్యోతిష మహాసభల నిర్వహణలోగూడా ఆయన తన మహాశక్తిని ప్రదర్శించారు. నలుగురిని కూడగట్టుకొని తన అజేయమైన ధీశక్తితో మహాసభలను నిర్వహించడం గొప్పవిషయం.

సాంఘిక రాజకీయ సాంస్కృతిక రంగాల్లో ఆయన నిర్వహించిన పాత్రలు విశిష్టతల్ని పుంజుకున్నాయి. తన ప్రోత్సాహంతో ప్రఖ్యాతి లోకి వచ్చినవారు తన హంగుదార్లుగా రూపొందాలన్నది ఆయన అభిమతం కాదు. కాబట్టి వర్థిష్ణువులకు, లబ్ధప్రతిష్ఠులకు కూడా చేతనయినంతవరకు ప్రోత్సాహం అందజేసే తన కార్యక్రమాన్ని ఆయన నిరంతరంగా కొన సాగిస్తున్నారు.

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు తెలుగువారు నిజంగా గర్వించ దగ్గ నిగర్వి.

పట్టుదల పరాకాష్ఠకు శ్రీ పోతుకూచి. సామర్థ్యానికి మచ్చుతునక శ్రీ పోతుకూచి.

అలసట ఎరుగని తన కార్యకలాపాలతో ప్రతిఫలాపేక్షలేని తన సేవలతో ప్రజాజీవనంలో తాను ముందుకు నడుస్తున్నాడు. తన ప్రజలను ముందుకు మునుముందుకు తీసుకువెళుతున్నాడు. వారు ఒక క్రియేటివ్ జీనియస్. సాహిత్య సారస్వత రంగాలలో వారి ప్రతిరూపం ఈ విశ్వ రూప సాహిత్య దర్శనంలో ప్రతిఫలించింది. అందుకు మనం గర్వించాలి. భవిష్యత్తరాలు కథలు కథలుగా చెప్పుకోవాలి.

ఈ జనవరి 27న వారికి జన్మదినశుభాకాంక్షలు.

# * అభివందన సుమం *

ఒక విశ్వసాహితి ఆతని
నిరంతర తపస్సుల రసధుని ।
మన తెలుగు రచయితల కతడు
అందాంతర బంధుజన సముడు ।
యువకవితా రసాస్వాదనకు
చేయందించు కొంతంత వెలుగు ।
నవ్యసాహితీ వైభవాలకు
రూపమిచ్చు నారింజ రంగు ।
చేతనా మృతమైన
సాహితీ చైతన్య మూర్తికి
ఇదే సత్కారం ।
అవధు లెరుగని
అసామాన్య తరంగ శక్తికి
ఇదే సన్మానం ।

—శిరిపురపు జవహర్‌లాల్